శ్రీ మత్పర దేవతాయై నమః.

# శాంతిసమరము.



1000


శతావధానులు,

సత్యదుర్గేశ్వర కవులు.



1940




మూల్యం. 0—8—0

శ్రీమత్పరదేవతాయైనమః

# శాంతిసమరము.

శతావధానులు

సత్యదుర్గేశ్వరకవులు.

1 కూర్పు 1,000.



మూల్యం 0_8_0.

# నా అభిప్రాయము.



పండితవర్యులును, శతావధానులును, నా ప్రియమిత్రులును అగు బ్రహ్మశ్రీ సత్యదుర్గేశ్వరకవులచే విరచింపబడిన ఈ శాంతి సమరమును నేను 'ఆంధ్రవాణి' పత్రికలో పూర్తిగ చదివితిని. అయ్యది :—

"మ॥ నిలువన్ నీడ, భుజింపనన్నమును; మేనిండాల్ప నింపైన మే।
ల్వలువల్ లేక అహర్నిశల్ హృదిన దేశభక్తిన్ స్వదేశాంబ చిం।
తలుపాలై కడుగుందుచుండ; మనసేదారిన్ సుఖింపంగ దా।
దలపోయున్? నిరతాత్మ దేశజననీతాత్పర్య సేవార్థికిన్॥

ఉ॥ పిల్లలు పాపలంగనలు వృద్ధులటంచును జాలిలేక; భూ।
వల్లభులందఱున్ బ్రజలపై గురిపించిరి అగ్నివర్షముల్।
తొల్లిట; గొందఱందిపుడు త్రోవకువచ్చిరి; కాని ఔంధుభూ।
వల్లభుఁడొక్కఁడే సుగుణవంతుడు; తన్నృపుబోల రెవ్వరున్॥

మ॥ కనియున్ బెంచిన మాతృదేశమును లోకంబందు నేమూర్ఖుడై।
ననుమ్రింగన్ గమకింపడ; ట్టియెడ నానాపాట్లనున్ వైచి; ఈ।
మనలన్ బెంచియు పెద్దజేసిన కులాంబన్ నేటికీరీతి మ।
ర్దనచేయన్ బ్రయతించినారకట! వీరల్; గుండెలెట్లొప్పెనో!

ఉ॥ జానెడు పొట్టకై సచివసత్పధమున్ గడియించి తెట్టులో।
ఈనరజన్మయందు; నిటులే మును జన్మనుగూడ నుండనే।
మైనను జింతచేయక; నిజావని సేమముగోరు శాంతి సే।
నానివహమ్మునిట్లు కఠినమ్ముగ బాధలుపెట్టె దేలకో!"

తేనె లోలుకు ఈ మొదలుగాగల పద్యరత్నములతో ఒప్పారుచూ; వీరి కవిత నిరుపమానమైనదిగా పాఠకలోకము

నకు వ్యక్తముచేయుచున్నది. వీరి భాష సరళమై సామాన్య జనులకు అవగాహమై వున్నది. దీనియందు మన భారతదేశ స్థితిగతులును సౌభాగ్యనగర స్థితిగతులును చక్కగా వివరింపబడుట కడుంగడు ముదావహమగు విషయము. ఇయ్యది స్వాతంత్ర్య సాధనకు మార్గదర్శియై అలరారుచున్నదనుటకు ఆవంతయు సందేహములేదు. ఈ దృశ్యకావ్యము ప్రతి భారతీయుని విధ్యుక్త ధర్మమును తేటతెల్లముగా విశదపఱచుచు ప్రహాసరములకు సాధనభూతమై యున్నది. అంతేకాకుండా ఈ ఏకాంకిక ఎంతటి నిరుత్సాహునైనను నిర్మల దేశభక్తిపూరితునిగజేసి ఆతనిజన్మ సార్థకత పఱచును. మన దేశ పురోగమనానికి ఇట్టి నవ్యరాజకీయ నాటకములు ఎంతో ఆవశ్యకములు. ఇట్టి దివ్యరచనలకు నేడు మన సత్యదృష్టికవులు మార్గదర్శకులైరి. అనతికాలములోనే వీరి యీ నాటకము (గ్రంథహక్కులు వెలువడి సోదరీ సోదరాంధ్ర) మహాజనుల కరకలంబుల బ్రకాశించుగాత మని అభగవానుని మనఃపూర్వకముగా ప్రార్థించుచున్నాను. సోదర భాషాభిమానులందఱినీ వీరి ఈ సదుద్యమమునకు తమ సహజశక్త్యోద్భవ అర్థించుచున్నాను. భగవానుడు ఈ కవివర్యుల కవితాకన్యను సదా పోషించుచు శ్రీ కవులకు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధుల గలుగజేయుగాక.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఇట్లు, బుధజనవిధేయుడు,

(Sd) జె. ఆదినారాయణగుప్త.

హైకోర్టువకీలు, మిరియాలగూడెం. (నైజాం.)

# తాంబూలము.

హైందవాచారరీత్యా ప్రతిపత్తి ద్వారాలలో మొదటిది తాంబూలము. గ్రాంథికాచారరీత్యా దృశ్యపత్రాలలో మొదటిది ముఖపత్రం. ఇక్కడ నామద్వయానికే కాని, భావద్వయానికి ఏమాత్రముకూడా ఎరమఱిక లేదు. కనుకనే ఈ నవ్యశ్లేషకను ప్రయోగించడానికి సాహసింపగలిగేం.

సరే ఇక ప్రస్తుతాంశము; ఈ శాంతి సమరాన్ని వ్రాసిన రోజులు, ఆంధ్రవాణిలో ప్రకటించిన రోజులు, పుస్తకవచ్చినప్పుడల్లా "తేహినో దివసాగతాః" అనే భవభూతిగారి భాషియం (*idiom*) నాలుక చివరదాకా వస్తూఉంటుంది. ఔనుమఱి అప్పుడే సంవత్సరం దాటుతోంది. ఈ ఆలస్యానికి మూలం ఆంధ్రవాణి. నాడు సికందరాబాదులోని దేశోద్ధారక గ్రంథమాలవారు ఈ సమరాన్ని ప్రకటనార్థం కోరినప్పుడు ఇవ్వకపోవడానికి కూడా కారణం ఆంధ్రవాణియే. మఱి నేటికి దీని రోజులు బయటపడినవి. సరే మంచిది. ఇందులో నా మిత్రులంపిన అభిప్రాయం ఒకటి ఉంది. అది అయాచితం. గ్రంథముద్రణకు శాంతి సమరంగల ఆంధ్రవాణీ పత్రికలు సకాలానికి నాదగ్గరలేకపోవడమువలన మీదగ్గర ఉన్నవి- పంపించవలసిందని ఉత్తరం వ్రాస్తే- పాపం! శ్రమచేసి ఏనాటివో ఆ పాత పత్రికలన్నీ వెదికి తిరుగు టపాలో రిజిష్టరు చేసి పంపించేరు దయతో. అదే సందర్భములో అంగీకరించవలసిందని కోరుతూ ఈ అభిప్రాయాన్ని కూడా పంపించేరు. అప్పట్లో శ్రీ వకీలుగారు వ్రాసిన ఉత్తరాన్ని కూడా ఇందు ప్రచురించేను, చూడండి. బహుశః-

ఈ గ్రంథములో అప్పటి నాటక రచనా నియమాలు ఉండవు. ఒకవేళ ఎక్కడేనాఉంటే ఉండవచ్చును. అంత ఉండవని చెప్పడానికి వీలులేదు. కాని ఇంతకూ చెప్పేదేమిటంటే మా శాంతి సమర రథం ఆదృష్టితో మాత్రం జన్మించలేదు. ప్రస్తుత ఇతివృత్తవాతావరణాన్ని అనుసరించి ఈ స్వరాజ్య గ్రంథాన్ని నడిపించవలసివచ్చింది. ఈ ఏకాంకికను సకాలానికి వ్యాసరూపేణా ఆంధ్రభూమికి అందజేసినందుకు మన ఆంధ్రవాణికి ధన్యవాద సహస్రాలు. ఆఁ మరచేను; ఈ రాజకీయ దృశ్య గ్రంథాన్ని ఇట్లా వ్రాయగలిగేనంటే- అది కేవలం ఆనాటి పత్రికా వాతావరణాధారాన్ని బట్టికాని; మరోదాన్ని- మరోదాన్ని బట్టికాదు. కనుక ఇందలి ఇతివృత్తము నాంతం పత్రికా సంపాదితమే. ఆ విషయములో అగ్రతాంబూలం ఆంధ్రవాణిది. ఈ పుస్తకాన్ని హిందీభాషలోనికి అనువదిస్తాము. ఆజ్ఞ ఇవ్వవలసిందని కొందరు మిత్రులు కోరేరు. కాని కొన్ని కారణాంతరాలవల్ల 'ఊ' అనజాలకపోయేను. ఒకోఅంత ఇక మునుముందు తీరగలదని భావన. సోదర సోదరీ యువకవి కవయిత్రులు ఇంకా ఇటువంటి నవ్య రాజకీయ గ్రంథాల్ని ఎన్నో విరచించి భరత పురోగమనానికి తోడుపడుతారని ఆశిస్తాను. తథాస్తు.

ఇట్లు,

ద్వివేది.

శతావధాని.

ఓం.

మిర్యాలగూడెం,
ది 13-4-1349. (ఫా॥)

—♦ శ్రీ శుభమస్తు ♦—

శ్రీయుత సత్యకవి శతావధానులగారి దివ్యసముఖమునకు

ప్రియ మిత్రమా !

నమస్తే!

తమ లేఖ నిన్నటిరోజు సాయంకాలమందినది. బహు కాలమునకైనను తమ క్షేమసమాచారములు తెలిసినందులకు కడు సంతసము.

"శాంతిసమరము"ను నాటకము ననుసరించిన 'ఆంధ్ర వాణి పత్రిక' *Pieces* కట్టింగులన్నియు మీ ఆజ్ఞప్రకారము తమ పేర రశీదు తలపు రిజిష్టర్ ద్వారా నంపుచున్నాను. చేరిన వెంటనే తెలుపప్రార్థితులు.

ఇదియునుగాక ఈ నాటకముననుసరించి నా 'అభిప్రాయము' ఈలేఖయుక్తముగా పంపుచున్నాను. చిత్తగింప ప్రార్థితులు. శీఘ్రమే తమ ఈ నాటకము పుస్తకరూపమున వెలువడుగాకయని భగవానుని ప్రార్థించుచున్నాను.

నేనంపిన అభిప్రాయమును తప్పక తాము స్వీకరించి పై పుస్తకమునందు బ్రచురింపజేసి నా భాషాసేవకు అవకాశమొసగిన వారగుదురని యాసించుచున్నాడను.

ఇట్లు,

మీ ప్రియమిత్రుడు

బుధజనవిధేయుడు

(Sd.) జె. ఆదినారాయణగుప్త.

# పు రో గ మ ని క

( సౌదామినీ మహేంద్రులు )

మ:— (తనలో) ఈ నగర సౌభాగ్యమెంత చూచినను తనివి తీరకున్నది. అయిన నిట్టి నగరీమతల్లులు మన మాతృభూమిని లేవా? (పరిక్రమించి) హా— ప్రస్తుతము లేనిమాట నిజమే. అది మన ప్రస్తుత దౌర్భాగ్యము కాని బ్రతికిన రోజులలో ఇంతకంటెను సుప్రసిద్ధములైన నగరీమతల్లులను బుట్టించు మన భారతమహామాత. (వెలుపలకు) సౌదామినీ! ఈ సుందరభవన మెవరిది?

సౌ:— ఇదియా? ఇది ఎవరిదో నాకును తెలియదు. కాని ప్రస్తుతము విజయోంగరా పండితులిందు విడియున్నారని మాత్రము వింటిని.

మ:— అటులనా! అయిన నేడెంతయు సుదినము నేడు మనకు వారిదర్శన భాగ్యము లభించును.

సౌ:— మహేంద్రా! ఆ దర్శన మంతటి మహత్తరమైనదగుటకు అతడేపాటి వాడు? మహారాజా?

మ:— సౌదామినీ! ఇంతదూరము వచ్చి ఉన్నతవిద్య నభ్యసించుచున్న దానవైనను; ఇంకను నీవు తగిన లోకజ్ఞానములవడలేదుసుమా! సౌభాగ్యవతీ!

చ॥ అతడుమహామహుండు; డతని వ్యాప్తికి ద్రికె నేటి యీప్రపం।
చిత సువిశాలభూవలయసీమయు దా నిరుకయ్యె; అట్టి భా।
రత జననీ సుతాగ్రణికి రాజులుకా రధిరాజులైన నే।
గతి జతనత్తు రాతని ముఖాముఖి నిల్చుటకైన నర్హులే?

సౌ:— భేష్! మహేంద్రా! నీ హృదయోద్రేకమునకు సంతసము. నాకుమాత్ర మతని ప్రతిభావిశేషములు తెలియవనుకొంటివా? తెలుసును— కాని ఇంకను భారతీయ పురుషుల రక్తనాళములలోని నెత్తురు జాతీయ ధర్మరతితో నాడుకొనుచున్నదో లేదోయని కొంచెము తెలియవలచి ప్రస్తుతమిట్లు నిన్నుగొంటినై ప్రశ్నించితిని, క్షమింపుము.

మా:- విద్యావతీ! అమూల్యమగు నీ యాంగ్లాంగికాభిప్రాయము క్షంతవ్యము కానేరదు. సోదరీ! చూచితివా? భారతీయ స్వదేశ సంస్థానములలోని వాతావరణము ప్రస్తుతమెంత యత్యాచారముగ బరిణమించుచున్నదో!

సౌ:- ఔను- అది కాలమహిమ. అందుకే నేటి విజయేంద్రరావు పండితుల సంయుక్త సమావేశము.

మా:- ఔనట. సౌదామినీ! రేపు మన వసతిగృహమున జరుగబోవు భారతీయ విద్యార్థి మహాసభకు నింతవరకు నధ్యక్షుడు నిర్ణీతుడు కాలేదు. కాబట్టి నేడా దిగంత యశోవిశాలుని; ఆ స్వార్థత్యాగుని; ఆ పండిత పుత్రి షష్ఠీ తత్పురుష పదాచవాడి నాశకుని; ఆ గూఢానుబాహుని తదధ్యక్షపదవి నలంకరింప బ్రార్థించెదు.

సౌ:- ఓ! అంతకంటె గావలసినదేమున్నది? కాని అతడు ప్రస్తుతము విజయేంద్రరావు తృతీయుడై ఇయ్యెడ భారతీయ స్వదేశ సంస్థాన వాతావరణమును గురించి చర్చించనున్నట్లు వింటిని. కనుక సభానంతరంబ మగుడివచ్చి అభ్యర్థింతువేని; వారును తప్పక శిరఃకంపమొనర్తురు.

మా:- ఔను- అటుదానన్నను; మంచి సమయాలోచన చెప్పితివి. నాఁడు! మొన్న నీవు నీగదిలో ఏదో భారతీయ సంస్థాన వాతావరణమును గురించి వ్రాయబడిన పాటను జనవృత్తముండగ గొంచెము వింటిని. అది నా హృదయము నాకట్టినది. అడుగుదమనుకొంటిని గాని యెందుకో ప్రసంగవశమున మఱచితి నిప్పుడు జ్ఞప్తికివచ్చినది. ఏది; యొకమారు వినిపింపుము- వినవలయునని యున్నది.

సౌ:- ఆనక వినిపింతునులే.

మా:- కాదు - ఇప్పుడే.

సౌ:- ఇప్పుడు కాదు. ఇప్పుడిటకు పండితుడు రా సమయమైనది. ఇంక మన మిటనుండి తప్పుకొనవలయును.

మా:- మన మెందుకు తప్పుకొనవలయును?

సౌ:- ఎందుకనిన - ఎందుకును లేదు. అతడు పెద్దవాడు బాగుండదు మఱి.

మా:- సరలే - నీవైతే ప్రారంభింపు. పూర్తియైన బూర్తియే యగును; లేదా సగములో మానవచ్చును. మఱేమియు శబరిలేదు.

సౌ:- సరే- విను; ఆఁ- మఱచితి; నన్నా! అది పద్యము. పాటకాదు మఱి.

మ:- అల్లాగా! అప్పుడు నీ ఆలపద్రాగ మాధుర్యమున పారవశ్యము నొంది అది పాడేయనుకొంటిని. పద్యమా? ఇదుగో! చూచితివా? నాకు పద్యమనిన మఱింత ఇష్టము. ఏదీ - మఱిపాడు.

సౌ:- ఊఁ- విను;-

ఉ॥ పుట్టిననాటగోలె సుఖమూర్తులుకాని; రవంతయైన ని
క్కట్టుల జెందియుండరనఘా! మనవార; టులంచునేడు చే
బట్టిన కార్యముఁ విడరు; భారతసేవయనంగవారికిఁ
గొట్టిన పిండియయ్యె; దయగూర్పవె గాంధిసురేంద్ర! వారలఁ॥

మ:- బాగుంది. అటు చూచి సౌదామినీ! అవిగో విజయేంద్రరాపండితుల ఆగమన మంగళసూచక మంజుల శబ్దములు. ఇంక ఏగుదమా మఱి?

సౌ::- నేనన్నది యోచన. సరేపద.

[ నిర్గమనము ]

ఇది

నవ్యస్థాపన.

# శాంతిసమరము

## ప్రథమాంకము

### 1—వ రంగము

### లండను నగరము—పర్యాలోచన మందిరము.

(విజయేందిరా తృతీయుఁడై పండితుఁడు ప్రవేశించును.)

ఇం:— (దరహసితవదనయై) పితాజీ! ఈ 'సోఫా' బాగున్నది. దయచేసి తమరిందుకూర్చొనుఁడు. నేను సత్తయు నా 'సోఫా' యందు గూర్చుందుము.

పం:— (నిశ్వసించి) తల్లీ! ఏ 'సోఫా' యయిననేమి? ఎక్కడనయినను గూర్చొనవచ్చును.

నిలువన్ నీడ భుజింప నన్నమును మేనిన్ దాల్ప నింపైన మేల్
వలువల్ లేక; అహర్నిశల్ హృది నదేశక్కన్ స్వదేశాంబ చింతలు
పాలై కడు కుందుచుండఁ; మన సే దారిన్ సుఖింపంగ దా
దలపోయున్? నిరతాత్మ దేశ జననీ తాత్పర్యసేవార్థికిన్.

ఇం:— అదికాదు నాయనా! తమరీ పాశ్చాత్యభూపర్యటనమువలన నెంతయు డస్సియుండుటను: నా 'సోఫా' తమ కనువుగా నుండెడిదని నాకు దోచుటను; నా పైన తమయందు నాకుగల చనువుంబట్టియు; దమ్ము నట నధివసించి సేదదీర్చుకొన ప్రార్థించుచున్నాను కాని; తమరు కేవల సుఖభోగాభిలాషులనియు నందేకాని వేరొకట గూర్చొన లేరనియు; దలఁచికాదు. నిజమున కనుభవింప నిచ్ఛగింతురేని; ఆగర్భ శ్రీమంతులగు తమకేది కొఱంత?

గీ॥ కోట్లకొలఁదిని ద్రవ్యమ్ము కూర్చిపెట్టి।
నట్టి తాతకు గారాము పట్టివయిన।
నీకు లోటేమి? భోగింప నేదియైన;।
అసలు తద్వాంఛ తమకు లేదాయెగాని॥

విజయ:- అగ్రజా! వృథా కాలయాపనమేల? తమరా సోఫాయందు కూర్చొనుడు మేమిపుర మిందు గూర్చుందుము. అప్పుడింపర కోర్కెయు దీరగల్గుండును. (అందఱు యథానిర్దిష్టములైన యాసనముల నధివసింతురు)

చం:- చెల్లీ! ప్రస్తుతము నీ యారోగ్య మెప్పటివలె గుదుటబడినదా?

వి:- ఆ! కాలవశమున నయమే.

చం:- 'కాలవశమున' నిన నాకంతగా వ్యక్తమగుటలేదు. అయిన నింకను నస్వస్థత సాంతముగ నీఁగలేదా?

విజయ:- సంపీరి!

గీ॥ అస్మసంతాన కష్టము లరయు నోప।
లేక; జేయున దేదియును లేమి నన్న।
పాసముల్ మాని; యశ్రుపులాసనమున।
జారికల్ కట్టు గడియైన శాంతిలేక;।
'అయ్యొ గ్రహచారమా' యంచు నటమటించి।
కుందుచున్నది భారత కునలయాంబ;।
ఆమె యారోగ్య మజ్జన మవకమునుప।
యుగ్గలాత్మకు స్వస్థత పట్టునన్న!॥

ఖండాంతరగతుడవైన నీకీ లోగడ మన తల్లి బాగోగులేమైన పత్రికా వీక్షణమున నేమోకాని; ప్రత్యక్షముగ దెలియుటలేదు. ప్రస్తుత మామెపడుచున్న బాధల ప్రత్యక్షముగ వీక్షించినవారికి గుండియలు బేజారగుచున్నవన్నా!

పం:- విజయా ! భయపడకుము. మన భరతమాతకు నాగోగ్యమజ్జన సమయ మింకను నాసన్నమవలేదు. కాని యట్టితతి దగ్గరిలు చిహ్నములొకటి వెంబడి నొకటిగ గోడచూపుచున్నవి. ఇంక బహుశః - అనతికాల మునసే కృతకృత్యకావచ్చును.

విజయ:- అన్నా ! ముందేమగునోకాని; ప్రకృతమాపె శరీర మన్నివిధముల 'హూనా' మయిపోవుచున్నది. చెప్పిన నమ్మవేమోకాని; యాబాపలు వీక్షించునత్తరి యామె యొడలుకంటె ముందు మనశరీరములే పగులు వారుచున్నట్లనిపించెడిని.

పం:- అంత దారుణమా ! (తనలో) నాకీమధ్య నామె పత్రికాగగన్నై కన బడుటయేకాని ; ప్రత్యక్షదర్శన మిడుటలేదు (పైలుపలకు) నిజమేనా? చెల్లీ !

వి:- అవునన్నా ! అందులో మాబోటి యాడువాండ్రా యెగ్గుల ననలే చూడలేకున్నారు.

పం:- (ఆశ్చర్యముతో) ఆఁ!

వి:- అన్న ! వెరగొందెదేల ?

ఉ॥ పిల్లలు పాప లంగనలు వృద్ధులటంచును జాలిలేక ; భూ
వల్లభులందఱున్ బ్రజలపై గురిపించిరి యగ్నివర్షముల్
తొల్లిట; గొందఱిందిపుడు త్రోవకువచ్చిరికాని ఔంధ భూ
వల్లభుడొక్కడే సుగుణవంతుడు; తన్నృపుబోల రెవ్వరున్.

పం:- (ఆశ్చర్య భయ కోపానుకంపా పులకిత గాత్రుడై) చెల్లీ ! నేనుం నిద యంతయు బత్రికాముఖమున వినినప్పు డేమోయనుకొంటిని గాని; ప్రకృతము నీనోటనుండి వినుచుండిన నా గుండె నిలువున నీరై బేజారగుచున్నది. (అంజలిఘటించి) తల్లీ ! లోకైకపావనీ ! ఒకా నొకప్పుడు సమస్తభూగోళమునకు నాధిపత్యమువహించి తులలేనిసిరుల దూగిన నీ నిరుపమానౌన్నత్య మీ నాటికి మాకోరిక లాఱడివో సిల్లు పరిణమించుచున్నదికా ! ఔరా ! కాలవైపరీత్యము ! పెద్దలనెడి దత్తపుత్రశోకము నీయందు ప్రత్యక్షమగుచున్నది; తల్లీ ! కట్టా—

ఉ॥ తల్లియు దండ్రియుఁ దివిపథమ్మున కేగిననాఁడు నాకు హా
త్తిల్లిన చింతకంటె గడు నెక్కువగా హృదినాటె; నేడు వా
టిల్లిన నీ యుపద్రవము నీక్షణ జేయుట గల్గినట్టి చిం
తోల్లసితాయుధాగ్రమి; ది యూడెడిమార్గముదేన గల్గునో!

ఓ సోదర సంస్థానాధీశ్వరులారా! ఇది యెక్కడి యన్యాయము?

మ॥ కనియుం బెంచిన మాతృదేశమును లోకంబందు నేమూఢుడై
నను బ్రేమింగన్ గమకింప దట్టియెడ నానాపాట్లకుఁ సైచి ఈ।
మసలన్ బెంచియు బెద్దజేసిన కులాంబన్ నేఁటి కీరీతి మ
ర్దనజేయన్ బ్రయతించినారకట! మీరల్; గుండెలెట్లోప్పెనో!॥

చ॥ సచివుల ప్రోద్బలమ్ముననో స్వస్వదురూహాల చేతనో కడున్
బచన మొనర్చినారు మన భారతమాతృ శరీరమెల్ల; దం
డ చటుల తాడనాగ్నికలసన్ ; మునుపేగెను; ఇంకనైన మీ।
రచనలు మీరుమాని; కనరా! జననీ సుఖదాయకస్థితిన్॥

వి:- (తనలో) తల్లియొగ్గులను వినినకొలది నన్ను హృదయాగ్ని పెచ్చు పెరుగుచున్నది. ప్రస్తుత మితని వైఖరి జూచిన; నితని దృక్కులకు జింపిరితలకట్టుతో బొప్పలుకట్టిన యొడలితో 'అలోలక్ష్మణా' యని విలపించుచున్న ఆ భరతమాత తప్ప మఱెవ్వరును గనవచ్చునట్లు తోచదు. ఇతని నీయావేశనిద్రనుండి మేల్కొలిపినగాని నా చెప్ప వలసిన సమాచారము కొనముట్టదు. (వీపుఁదట్టి) అన్నా! అన్నా!

పం:- (ఉలిక్కిపడి కన్నులు నలుముకొని చూచి) ఏమమ్మా!

వి:- ఏమ్మా! నీవట్లూరక చూచుచుండిన నాకు భయమనుపించి పిలచితిని.

పం:- భయమెందుకు? తల్లీ! మన భరతజనని తనకు వాటిల్లిన యుపద్రవమును గద్గదికమై వినుచుచు విలపించుచుండ నాకేమియు దోచక నాపె ప్రక్కనే చూచుచు గూర్చొంటిగాని మఱొండు కాదు (నగి)

అమాత్యపదవీ నిర్వహణ ధురంధరవగు నీకును నిట్టి వెట్టి పిరికితనములేల కలిగెడి నమ్మా?

శ:- ఎంత ధురంధరులమైనను; అబలల నైసర్గిక స్వభావ మెచ్చటకు బోవును? అయినను అది విజృంభించవలసినదే కాని విజృంభించిన తదుపరి వారిలోనున్న యీ యబలాత్వము పంచబంగాళమయి ఆవి శక్తిత్వము లీనమై వారికి దృఢ చేతస్సును బ్రసాదించును. కాన నెవ్వరును "నాడువారు కేవల మబలలు; వారితర వ్యవహారములపట్ల నుపకరింప" రని యపభ్రమ పడరాదు. అన్నా! ప్రస్తుత ప్రసంగ వశమున ముందటి కార్యక్రమము మఱచితిని. ఇక నేను భారత దేశాభిముఖిగావలయు సమయ మాసన్నమగుచున్నది;- దయచేసి సెల వొసగుము. (లేచి; పో నుద్యుక్త యగును.)

పం:- మంచిది జాగ్రత సుమా!

శ:- ఆ! అల్లాగే. ఇందిరా! పోయివచ్చెదను. (ఇందిర నవ్వుచు సెల నూపును, ఆమె వెడలును.)

ఇం:- నాన్నగారూ! మనము మగుడి భరతభూమికి వెళ్లునది యెప్పుడు?

పం:- ఇంక కొలది దినములలోనే (భారతమహాశాంతి సమరమును ఊహా ప్రపంచములో నూహించి) ఓ భారతీయ శాంతి సైనికులారా! ఓ యహింసా తత్వోపాసకులారా! నేడు మీరా యుగ్రదండనల నెట్లు సహింప గలుగుచున్నారో కదా!

మ॥ సమరాస్త్రమ్ములులేవు; లేవకట! యశ్వమ్ముల్; విమానాది ని
ర్గమయానమ్ములులేవు; "నా"యనెడి సారథ్యంబ లేదెట్టిలా
సమరంబందు జరించుచుండిరొకో! విశ్వస్తోత్రనీయమ్ము గాం
ధిమునీంద్రత్వపరిగ్రహమ్మెమనకున్ దివ్యాస్త్రశస్త్రాద్యముల్॥

మీకర్తవ్యమును మీరు నిర్వహింపుడు. తుదకు మీ యహింసాతత్వ భగవానుడగు ఆ గాంధి మహాత్ముడే మీకు విజయోదయము బ్రసాదించును. ఇందిరా! ఇక మనము త్వరలో స్వదేశాభిముఖులము గావలయు దివస మాసన్నమగుచున్నది కనుక నా ముగించుకొనవలసిన

కార్యకలాప మంతయు నా యాంతరంగిక మందిరమునకేగి ముగించుకొనుట లెస్స. ఏది; రా—దారితీయుము.

ఇం:- (లేచి) ఇటు దయచేయుఁడు (ఇందిరా పురస్కృతుఁడై పండితుడు నిష్క్రమించును.)

—: తెరపడును :—

## 2. రంగము.

## సౌభాగ్యనగరము—రాత్రిసమయము.

(వేరు వేరు చోటుల నాందోళనపడుచు రాజమంత్రు లిరువురు ప్రవేశింతురు.)

రాజు:- (పడకమంచమున గూర్చొని; కన్నులు నులుముకొనుచు) అర్ధరాత్రి యయినను నేఁడేమో! నాకు నిద్దుర పట్టకున్నది. పైపెచ్చు హృదయము వాచామగోచరములగు భయాందోళన వ్యాకులతలతో నల్లాడుచున్నది. మఱి దీనికంతకును మూలమెద్దియో మనస్సునఁ బట్టుటలేదు. నగరమంతయు మాటుమణిగినది ఎటు విన్నను; రక్షకజనపాదరక్ష ధ్వనులు తప్ప మఱొండు వినఁబడుటలేదు. బలవంతముగ నిద్రఁ బట్టించుకొందమన్నను; లాభములేకున్నది అకటా! ఈ నడిరేయి నా యీ హృదయవేదన నెవ్వరితోఁ జెప్పుకొందును! (పిచ్చిన రెప్ప వేయకుండ నటే చూచుచుండును)

ప్రధాని:- (పడకమంచమున గూర్చొని; మొగము నిముడుకొనుచు) ఔరా! ఏమి? యీ వింత!

కం॥ నగరాత్రి కావచ్చెను;
అగుపింపదు నిద్దురింతయైనను; మేనిన్
సెగలూని చెమటపట్టెడు;
భగవంతుడ! యెట్లు తెల్లవారెడి నింకన్?॥

దీనికంతకును ఏదో తగినంత కారణముండక పోదు. (ఆలోచించు చుండును.)

రాజు:- (కన్నులు నులుముకొనుచు) అబ్బా! ఎంతసేపటికైనను నిద్రపట్టదు కదా! ఇఁక నిప్పుడు గత్యంతర మేది?

(తె ర లో)

కుమార!

ఉ॥ తాతలనాఁటనుండి చరితార్థ యశస్సును గాంచుచున్న ఈ
భూతల రాజ్యలక్ష్మిని; గవుంగిటబట్టి కలంచె బో! అప
ఖ్యాతి విటుండు నేడు; మరియాదను మంటను గల్పితయ్య! నీ
నేతృతకున్ ఫలమ్ముగ; మనీషులతో వ్రేలబట్ట వింతకున్॥

రాజు:- (ఆలకించి, తదేకదృష్టితో) ఈ కంఠస్వర మెవరిదై యుండవచ్చును? అయినను; ఇంతటి అర్ధరాత్రి నిట కెవ్వరు రా సాహసింతురు? ఇదం తయు జూడ కడుంగడు విచిత్రముగ నున్నది.

ప్రధాని:- కారాగారములలో బంధింపబడిన గౌరవనీయ శాంతిసైనిక దళములను ఒకవేళ మా రాజకింకరులు బాధించుట లేదుకద? (భ్రమ పడి) పాపము! నే ననుకొన్నట్లు రాజకింకరులు వారిని బాధించు చునే యున్నారు. అవిగో! వారి ఆర్తనాదములు! అక్కటా! నేనవి వినజాలను. (చెవులు మూసుకొని) వినినకొలఁది నా హృదయము నిర్భేదమగుచున్నది. (తెలివి తెచ్చుకొని) ఆఁ ఏమి! యీవింత ? ఆఁ ఎంతటిభ్రమపొడగట్టినది! (తదేక దృష్టితో) ఆమూల నెవరో పురు షుఁడువలె గనబడుచున్నాఁడు. (పారజూచి) ఆఁ- ఆఁ- వాడిన మోముతో గుంటుకొనుచు నిటే వచ్చుచున్నాఁడు!

నా యనుమతి లేనిదే పరులకు ప్రవేశింపనలవికాని యీ ప్రాసా దము నితఁడెట్లు ప్రవేశింపగలిగెను? అందునను అభ్యంతరస్థమగు నీ శయ్యాగారమున నెట్లు ప్రవేశింపగలిగియుండును? ఇదంతయు నాశ్చర్యముగనున్నది.

రాజు:- ఎంత యోజించినను; వ్యక్తమగుటలేదు.

[illegible]

మ॥ మతినై షమ్యములెల [illegible] నీపు సామ్రాజ్యంబులెన్నెన్నొ ఈ
మతి నై షమ్యములన్ గదా! ఏదిక నామ్మ [illegible] న లేకుండ ని
గ్గతి సర్వస్వములయ్యె-త్రొల్లి; కొడుకా! స్వామిభక్తి తో సర్వస
మ్మతుడై యుండుట శ్రేయ; మట్లయిన అస్మద్రాజ్యమింపారెడిన్॥

రాజు:- ఔరా! ఇది చాల విచిత్రముగానున్నది. (ఇటునటుజూచి) ఇందెటు జూచిన నే విధమైన వ్యక్తియు నగపడుటలేదు. మఱి; ఈ యాప్త వచనములెవరివై యుండును? ఈ చుట్టుప్రక్కల నేమైన భూతములు లేవుకదా? (ఇటునటు పరికించును)

ప్రధాని:- (అంగుళి నిర్దేశించి) అదుగో! నా కట్టెదుట నిలువబడినాడు ఏమియు పెదవికదపడు. అయినను; నేన పలకరించి చూచెద (ప్రకాశముగ) ఓయీ! నీ వెవరవు? ఇంతటి నడిరేయి నీ ప్రాసా దాంతరమున కెట్లు రాగలిగితివి?

పురుషుడు:- నేను నేనే; నాకు ప్రవేశింప నలవికాని ప్రదేశ మీచతుర్దశ భువనంబులం దెందును లేదు.

ప్ర:- ఈ ప్రసంగ మెంతయు విస్మయము గానున్నది. (ప్రకాశముగ) అయిన నీవిప్పుడిటకు వచ్చుటకు గత మేమి?

పు:- ఊర్ధ్వముననున్న నీ దృష్టిని గొంచెము క్రిందునకు దించి; పెడదారుల బట్టుచున్న నీ నడువడులను జక్కగ గమనించి; సరిచేసుకొనుమని చెప్పవచ్చితిని.

ప్ర:- ఆఁ ఏమి! వీని సాహసము? (వెలుపలకు) నా నడువడులయందెట్టి దొసగు లున్నవి?

పు:- (నవ్వి) సచివాగ్రణీ! నీబోటి యున్నతపదవీ విరాజితులు పరుల దోషముల నవి యావగింజంత లేయైనను క్షణములో గనుగొందురు; కాని గుమ్మడికాయలంత యున్నను దమ దోషములను గనుగొనలేరు. విను చుంటివా?

ఉ॥ గౌరవనీయమెంతయును గాం(గెసు సంస్థ జగాన; నెందఱో
ధీరనృపాల శేఖరులె దీనికి వంగి నమస్కరింతు; రీ
వో;రహీందల్పవింతకును 'ఉత్తమసంస్థ'యటంచు; చిన్న భూ
దారుని మంత్రివయ్యు; గలదా? చెపుమింత విరుద్ధమెందునన్॥

ప్ర:- (కోపదృష్టి నిగుడించి) ఎవ్వరైనను నాయెదుట యథేచ్ఛగా ప్రసంగించుటకు జంకుదురు. అట్టియెడ నితడెవ్వడో యొక సామాన్యుఁడు నా కళ్లెదుట నిలిచి యింత నిర్లక్ష్యముగ మాటాడుటకు సాహసించినాడు. ఔరా! వీని హృదయ స్థైర్యము! బంధింతునా?

(శాంతించి) వలదు వేగిరపాటు వలదు. (ప్రకాశముగ) ఓయీ! నీ వెవ్వడవో యెఱిగింపమనిన ఈ యనవసర ప్రసంగములేల చేసెదవు?

పు:- ఇవి యనవసరపు బ్రసంగములు కావు. ఇకనైన జక్కగా గమనించి వీని ననుకరింతువేని; మునుముందు నీకు మంగళోదయము లబ్బెడిని. (కాలిబాధ నిరూపించుచు) ప్రధాని! నీకింతయు జాలిలేదుకదా!

ఉ॥ జానెడు పొట్టకై సచివ సత్పథమున్ గడియించి తెట్టులో।
ఈ నరజన్మయందు; నిటులే మనుజన్మనుగూడ నుండనే।
మైనను చింతచేయక; నిజావని సేమముగోరు శాంతి సే।
నానివహమ్ము నిట్లు కఠినమ్ముగ బాధల బెట్టె దేలొకో!॥

అబ్బా! బాధ! బాధ!

ప్ర:- ఏమట్లు వగచుచున్నావు?

పు:- ప్రధాని! ఏమని విన్నవింతును. యమదూతల కష్టములనైనను ఓర్వ వచ్చును కాని; ప్రస్తుతము నీ రక్షక జనము పెట్టుచున్న బాధలను సహింపలేము. ఇదుగో! చూడు; - ఈ మోకాలి చిప్పలెట్లు కమిలి పోయినవో! బాబూ! ఇది యిరువదియవ శతాబ్దము. ఇకనైన; నీవీ రాక్షస కృత్యములనుండి విరమించుకొని; ప్రజా క్షేమము నపేక్షించు నాగరిక ప్రపంచమున గాలిడరాదా?

పర్షి:- ఔను నిజమే. కాని యేమిచేయుదును? ఏమిచేయుటకు దోచక నే; యిట్లు తోడి ప్రధానుల ననుకరించితిని. అందు కేరళ ప్రధానిని చాలవరకు ననుకరించితిని. అయినను వారియంత దారుణములను నేనింకను యొనర్చుట లేదే.

పు:- కనుక నే; నేటికిని కొంతమట్టుకు ధన్యుడవనిపించు కొనుచున్నావు. (బాధ నిరూపించుచు) హా! బాధ; - బాధ; - బాధ; -

పర్షి:- (చూచుచు నాశ్చర్యముతో) ఏడి! ఆ పురుషుడేడి! ఔరా! రెప్పపాటుననే మాయమయినాడు! ఎటుపోయెను ?(ఆలోచించి) ఇతడు కేవలము నాకు కుశలమార్గ మెఱింగింపవచ్చిన ఆ పరాత్పరుడే కాని; నరమాత్రుడయి యుండడు. ఆహా! ఆ భగవ ల్లీలాస మెన్నివిధములుగ బరిణమించుచున్నదో కదా! మొదట నజ్ఞానుడనై ఆ దివ్యమూర్తిని కొంతవరకు దూరితిని. ఎంత అపచారము! పాపము పశ్చాత్తాపముననే శాంతించుగాక. ఇదంతయు చెల్లవాటిసపిడప మహారాజున కెఱింగించి తదుపరి కర్తవ్యము నాలోచించెద (పరుండి నిద్రింప బ్రయత్నించును.)

తెరలో)

కుమారా!

ఇందేమియు భూతములు లేవు. ఈ పలుకునది నీ జనకుడను నేను. నీ మేలుగోరి నీకు సద్గతినుపదేశింప నిట్లీ యర్ధరాత్రి స్వర్గమునుండి దిగివచ్చితిని. నీకీరేయి నిద్రపట్టకుండుటకు సత్యవాఙ్మిరతిగ్రమైన ఆర్యరాజ్యసంస్థయెడ నీ వొనర్చుచున్న అపచారములే మూలము. ఇకనైన నీవీ యపచారముల నుండి విరమించుకొని, జగత్పావనమైన ఆసంస్థ కనుకూలుడవై కొంగ్ర భూమీంద్రునివలె నకళంక యశశ్చంద్రికను రోదసీ గహ్వరమునందంతటను వెదజల్ల నుంకింపుము.

రాజు:- (గుభాలున దిగి) తండ్రీ! నీవేనా? నీ దివ్యదర్శనము నేడు బహుకాలమైనది. ఏది; ఒకమారగపడవా? (ఇటునటు నడాచి చూచుచు), ఆ! ఎక్కడున్నావు తండ్రీ! అక్కటా! ఒకమారైన అగపడవా? (పరికించుచుండును)

( తెరలో )

ఇది సమయముకాదు నేనిక పోవుచున్నాను జాగ్రత!

రాజు:_ హా! పోవుచుంటివా! తండ్రీ! ఔను;_ పోక నావంటి నిర్భాగ్యున కెట్లు దర్శనమిత్తువు. (పరిశీలించి, దీనుఁడై) పోయినాఁడు. ఇఁక నొక పలుకైనను వినబడుటలేదు. అకటా! (నిశ్వసించి) ఇప్పుడేమియు నాకు బాలుపోవుటలేదు. తెల్లవారినపిదప ప్రస్తుత రాజకీయములను గురించి మంత్రిశేఖరునిరావించి యతనితో నాలోచింపవలయును. (గడియారముచూచి) తెల్లవాఱుఝాము కావచ్చుచున్నది. ఇంక నిప్పుడైన ఎటులో నిద్రపట్టించుకొనినగాని, ఆరోగ్యము పాడగును. (పరుండి నిద్రింప నుంకించును.)

## 3. రంగము

## ఆంతరంగిక మందిరము

(ఆంతరంగిక కార్యదర్శితో మహారాజు ప్రవేశించును.)

మహా:_ (తనలో) మొత్తముమీఁద చివరకెట్లో నేఁడు తెల్లవాఱినది. రాత్రి పొడగట్టిన యా యద్భుత మింకను నా హృదయకర్ణములకు వినబడు చున్నట్లే యున్నది.

గీ॥ దైవమేరీతి తుదకు సందర్భమౌనొ;
ప్రస్తుత పరిస్థితులఁజూడ భయము వ్యాకు
లతయు దోఁచెను హృదయ సరస్సునందు;
ప్రతిఘటింపగ సుంతయు బాలుపోదు.

ప్రధానమంత్రి యింకను రాలేదు. ఒకవేళ వచ్చుచుండవచ్చునా? (ప్రకాశముగ) కార్యదర్శీ! ప్రధానమంత్రికి రా తంతినిచ్చితివా?

కా:_ (కృతాంజలియై) చిత్తము దేవ! తమ యాజ్ఞానుసారం వింతకుమును పే యిచ్చితిని.

మహా:_ అయితే; సరే___ఇంక నీవేగి నీపని చూచుకో.

(అతఁడు తన పనిగదిలో బ్రవేశించును.)

మహా:- (తనలో) నిజమునకు మహాత్ముఁడు లోకైకపూజ్యుఁడు. అతఁడు స్థాపించిన ఆ పవిత్ర స్వరాజ్య సంస్థయందు నా యొనర్చు నపచారములకే నేచింతిల్లుచున్నాను. కాని ప్రస్తుత పరిస్థితులబట్టి తదన్యథా వర్తించుటకు వలనుబడకున్నది. కారాగారస్థులయిన ఆ శాంతిసమరవీరు లాయమబాధల కోర్వలేక లోలోపల నన్నెంతగ దూషించుచున్నారో కదా! అవియే నాయీ హృదయావేదనకు గారణ మనుకొందును. నిజమునకు వారి యుసురు నన్నీవిధమున బాధించుచున్నది. దైవమా! ఏమి చేయుదును?

చ॥ ఒకట‡ సమాఖ్య కొప్పుకొన నూరక నన్ బలవంతపెట్టు నాం
గ్లకులవలయేశుఁడిం; కొకట కాంగ్రెసునం దనుకూలవర్తనా
స్తికుఁడవుకమ్మ కానియెడ జిక్కులె నీకికముం దటంచు దే
శికుడు భయంబుపెట్టు; నెటుచేయుటకున్ మదితోచదక్కటా!

తక్కిన దెట్లున్నను; మహాత్ముఁడు చెప్పునది నా క్షేమమువకేకాని యట్లొనర్చుట కవకాశము లభింపకున్నది.

(తెరలో)

ఓ రాజకింకరులారా; నిర్బంధితులైన శాంతి సమరవీరుల నూరక నిట్లేల బాధించెదరు? మీ కేకోశమందైనను దేశభక్తి యనుమాటయే లేదు కాబోలు.

చ॥ మననము జేయరక్కట! క్షమాపణ నిమ్మని మర్మసీమలన్
గనికరమింతలేక; పొడి కారము జల్లి నునుంపుగజ్జులతో
కణుపులుకట్టు బాదినను గంపితులై యిడి పూర్వయత్నమున్
వెనుకకు లాగుకొందురె? వివేకులు శాంతిరణ ప్రవేశకుల్.

మహా:- (విని; సంభ్రమ హృదయుఁడై) ఎక్కడాకోలాహలము! అక్కటా! నగరమందెందుజూచినను శాంతి యనుమాటయే లేదు. ఎక్కడవిన్నను నా క్రందనములే! ఎక్కడ విన్నను వీరాలాపములే! తుద కెటు

‡ Federation.

విన్నను గోలాహలమే! చివర కీసంఘటనవలన నా పరిస్థితి యెట్లు పోయి యెటువచ్చునో విశదము కాకున్నది. కానిమ్ము అంతకును దైవమే దిక్కు.

మంత్రి (రాజద్వారము ప్రవేశించి;) ఓ. భగవంతుడా! పగవారికైనను ఈ మాంత్రికోద్యోగము మెడగట్టకుము. తండ్రీ, అబ్బ! ఎంతకష్ట మొంతకష్టము!

గీ॥ మంచిచేసిన; యదిపోయి మనుజవిభుని
జెందు; నొకవేళ చెట్టయే చేసిన; నది
మంత్రిపై బడు నెందును మంత్రివరున
కవని సుఖమన్నమాటయే యగపడదొకో!

(కరతాళి మొనర్చి) ఓరీ! ఎవడురా? అక్కడ.

సే:- (కృతాంజలితో నమ్రుడై ప్రవేశించి;) బానిసను; దొరా! బానిసను.
మం:- మహారాజుగారెక్కడ?
సే:- అంతరంగిక మందిరమున నున్నారయ్యా!
మం:- (జేబునుండితీసి) ఇదుగో మహారాజుగారి కీదర్శనపత్రి మిచ్చిరా.
సే:- చిత్తము (తీసుకొని, వెళ్లివచ్చి;) దొరా! సెలవైనది, దయచేయుడు.
మం:- ఊఁ! (సమ్మ సేవకుడుముందుండి దారిచూపుచుండగా లోనికిప్రవేశించును)
మహా:- (అటుచూచి) అదుగో! ప్రధాని ఆర్యా! స్వాగతము.
మం:- (ప్రవేశించి) రాజాధిరాజ! నమోనమః. (గౌరవక్రియానంతర మిరువురు నుచితాసనముల నలంకరింతురు.)
మహా:- ప్రధానీ! ప్రస్తుత రాజకీయములు మిక్కిలి క్లిష్ట పరిస్థితులకు గురియైనవి ఈ చిక్కులింకను ఈఁగు నట్లగపడుట లేదు.
మం:- ఔను పరిస్థితులు మిక్కిలి క్లిష్టముగనే పరిణమించినవి.
మహా:- నీ వింకను దీనికి ప్రతికూల మాలోచించుటలేదా? ఇటుమీదగూడ నీ పరిస్థితులిట్లేయుండిన; ప్రభుత్వమునకు గళంకమువచ్చుటయేకాక; భంగముకూడ వాటిల్లెడిని? ఒకవేళ దీని నణచు సామర్థ్యము నీయందు మృగ్యమేని నేను జోక్యము గలుగ జేసుకొనవలసి వచ్చును.

మం:- మహారాజ! తొందరపడకుఁడు. ఇప్పుడెటునుండి యెటువచ్చినను మనకే చిక్కు. నే నీ క్లిష్టపరిస్థితిని శాంతింపజేయుటకు దైనందినము దగిన యాలోచనల జేయుచునేయున్నాను.

మహా:- బ్రిటిష్ భారతీయులు మన రాష్ట్రీయులతో నేకీభవించి యుందేవో లేనిపోని సంస్థలనుచు స్థాపించి, తుదకీ యశాంతిని గలుగజేయు చున్నారు. లేనిచో నిదియొక మన రాష్ట్రీయులకే పుట్టిన బుద్ధికాదు. కేవలము వీ రనవరత భయాధికులు, ప్రభుత్వమనిన గిజగిజ లాడుదురు.

మం:- (తనలో) ఎంతభయాధికులైనను దమ నిరంకుశ పరిపాలన కిన్నాళ్లు తలలువంచి తిరుగగలరు?

గీ॥ సతిని బెనిమిటికొట్టిన నైచునప్పు
డపుడ, దే పనికాగ దయా విరహితుఁ
డై చితుకబాదినన్, నైచునే? చెలఁగి తి
రుగబడక; నెంతభయభక్తులు గలదైన?

(ప్రకాశముగ) మహారాజ! దీనికొక యుపాయమున్నది.

మహా:- ఏమది?

మం:- వెనుక సామ్రాజ్య ప్రభుత్వ మస్మదాదుల సంరక్షణకై "నరేంద్ర రక్షణశాసన" మను నొకచట్టము ను తీర్థ మొనర్చినది. కనుక మన మిప్పు డా చట్టమును మనయందమలు జరుప రాజప్రతినిధి నర్థించిన ప్రస్తుత పరిస్థితులబట్టి యతఁడును తప్పక నియ్యకొనును. అంతట బ్రిటిష్ భారతీయుల చేయూతపాసగమి నీ రాష్ట్రీయులు తమంతట దామే యణగియుందురు.

మహా:- ప్రధానీ! ప్రజలలో నలజడిపుట్టక పోవలయునే కాని, పుట్టిన పిమ్మట నదిమానుటకు బహువ్యవధి దీసుకొనును. అయినను, సామ్రాజ్య ప్రభుత్వమును ఈ చట్టమును మాయందమలు జరుపమని మనకు మనమై కోరుట అవమానకరమగు కర్జముకదా?

మం:- ఔను, కాని ప్రస్తుత మంతకంటే గత్యంతర మగపడదు.

మహా:- సరే కానిమ్ము:

( తెరలో )

ఓ రాష్ట్రీయ విద్యార్థులారా! మీరందఱును జాతీయ గీత నిరోధము నకై సమ్మెకట్టిన ఈ మాయందు సానుభూతిగలవారై దయచేసి మాలోజేరి మమ్ము ప్రోత్సహింపుఁడు—రండు; రండు.

"వందేమాతరం
సుజలాం సుఫలాం మలయజ శీతలాం, మాతరమ్ ॥వం॥
సస్యశ్యామలాం,
శుభ్రజ్యోత్స్న పులకిత యామినీం;
ఫుల్ల కుసుమిత ద్రుమదళశోభినీం;
సుహాసినీం; సుమధుర భాషిణీం;
సుఖదాం; వరదాం; మా...॥వం॥
త్రింశత్కోటి కంఠ కల కల నినాదకరాలే
ద్వి త్రిశంత్కోటి భుజైర్ధృతఖరకరవాలే;
కథయంతి జనాస్త్వాం; కథం మాతరబలాం;
బహుబలధారిణీం; నమామి తారిణీం;
రిపుదళవారిణీం;" మా...॥వం॥

మహా:- (వినుటనభినయించి) ఎవరిదా కోలాహలము ?

మం:- సౌభాగ్యరాష్ట్రాధీశ్వర! ప్రభుత్వము కావించిన శాసనము ననుసరించి విశ్వవిద్యాలయాధికారులు హైందవ విద్యార్థులను తమ జాతీయగీత మగు 'వందేమాతరము'ను పాడరాదని బలవంతపెట్టిరి. వారందులకు సమ్మతింపలేదు. తుదకు విద్యాలయముల బరిత్యజించి వారందఱు సమ్మెగావించిరి.

దానికి సానుభూతిగ దక్కనుగల రాష్ట్రీయ విద్యార్థులలో చెక్కు మంది యాదే సమ్మెను ప్రారంభించిరి. మొత్తముమీద నేటికి కొన్ని వేలమంది విద్యార్థులు విద్యాలయముల బరిత్యజించిరి. ఇప్పుడు తమరు వినిన ఈ కోలాహలము వారు సలుపుకొనుచున్న జాతీయ గీతికా

ప్రార్థనలే. తుద కేదియెట్లుకానున్నదో కాని మొత్తమువిూద నీయాలజడి నానారీతుల వ్యాపించుచున్నది.

మహా:- ఔను ఏదైనను గాలము ననుసరించునుగదా!

మం:- దేవర! ఒక ముఖ్యాంశము ప్రస్తుత మెంతయు మనవిజేయదగియున్నది. ఆజ్ఞయైన ఉపక్రమింతును.

మహా:- అదేదియో అవశ్యము చెప్పదగినది.

మం:- అవధరింపుడు-గతించిన రాత్రి నా కావంతయు నిద్దురపట్టలేదు. మరియు హృదయమున నెవ్వియో వాచామగోచరములగు భయవ్యాకులములు గిరికొని; నన్ను గలంచుచుండ; నా కెటును బాలుపోక: దదేకదృష్టి నిగుడించి యాకే చూడసాగితిని.

మహా:- (తనలో) నాయవస్థయు నిట్లే యయినది (ప్రకాశముగ) తరువాత?

మం:- అప్పుడు నా కట్టెదుట నెంతయు జిక్కిన ఒక పురుషుడు నిలువబడి; కారాగారమునందు అతనిని మన రక్షకజనులు పెట్టుచున్న బాధలు మిక్కిలి దుర్భరములుగా నున్నవని నాకు నివేదించి; తన్ముఖోపరి భయానుకంపా తగ్జన భావకాంతులు ప్రసరింప; "ఓ ప్రధాని! నీకు జాలిలేదా? నీకు దేశభక్తిలేదా? అయిన ఇంతటి రాక్షసకృత్యముల నేల చేయించెదవ"ని నన్ను స్వాయముగ మందలించినాడు.

మహా:- (తనలో) ఇది చాలా ఆశ్చర్యముగ నున్నది. (ప్రకాశముగ) తుదకేమి జరిగినది?

మం:- చిత్తగింపుడు-తుదకు నాకెఱిగింపవలసినదంతయు నెఱిగించి యత్యాద్భుతముగ రెప్పపాటుననే యంతర్ధాన మయినాడు.

మహా:- అయిన అతని నామ నివాసముల దెలుసుకొంటివా?

మం:- అడిగితిగాని యతడు చెప్పలేదు

మహా:- ఏమియు జెప్పలేదా?

మం:- చెప్పకేమి?

మహా:- అదెట్లు?

మం:- 'ఓయీ నీ వెవడవు? పరప్రవేశ దుర్ఘటమగు నాయీ ప్రాసాదాంతరమును నింతటినిశావసరమున కెట్లు ప్రవేశింపగలిగితివ'నిగద్దించియడిగితిని.

మహా:- దాని కతడేమని జవాబు చెప్పెను?

మం:- అప్పుడతడు: తన పేరు చెప్పలేదు సరేకదా; 'నాకీచతుర్దశభువనములందు బ్రవేశింప నలవికాని ప్రదేశమే లేద'ని నిర్ణయముగా నిర్వచించినాడు.

మహా:- (తనలో) ఇది కడుంగడు విచిత్రముగా నున్నది. (ప్రకాశముగ), అప్పుడు నీ వా పురుషునియేమని దలఁచితివి?

మం:- తప్పక దైవమే యయియుండునని తలఁచితిని.

మహా:- (తనలో) నిశ్చయము. లేనియెడల మా యిరువురకు నొకే కాలమున నిద్దురపట్టక పోవుట; తదుపరి నిట్టి విచిత్రములు సంభవించుటలుండవు. (ప్రకాశముగ) ప్రధాని! నీవలెనే గతించిన రాతిరి నాకును నిద్దురపట్ట లేదు. అటుపిమ్మట కొంతవడికి అశరీరాప్తోపదేశములు కొన్ని వినవచ్చినవి. మొత్తముమీద మనయిరువురి సంఘటనలను సమానములని చెప్ప వచ్చును.

మం:- (బొమలు చిట్లించి) ఆఁ! అయిన ఈ సంఘటనలందయిం దేదియో విశేష ముండి తీరవలయును. మహారాజ! మనమిప్పట్లు నెంతయు జాగరూకతమై మెలఁగినగాని చేటు వాటిల్లెడిని, మఱియు మనకు రాతిరి సంభవించిన అవిచిత్ర సంఘటనములు; ఆ దివ్యోపదేశములు; కేవల దైవికములు కాని మఱొండుకావు. అందునను స్వరాజ్యసంస్థ నెడు రొప్పుట త్రాటుపాముతో చెలగాటమువంటిది, చూచుచున్నారు కదా;- రవి యస్తమింపని ఆ సామ్రాజ్య పరిభుత్వము తుదకు దాని కేసరినామాలమే సంచరించుచున్నదో!

మహా:- ఔను ప్రస్తుతకర్తవ్య భారమునంతను నీమీదనె పెట్టితిని.

మం:- మహా ప్రసాదము (తనలో) ఇటుచూచిన మహారాజు భవిష్యత్కర్తవ్య భారము నంతయు నాపై బెట్టినాఁడు. అటుచూచిన రాజప్రతినిధి వాటికి వాటికి "నాయాట నేమిచెసితి"వని యుగ్గడించుచున్నాఁడు. మఱియొకం "నల్పసంఖ్యాకులమైన మాగతి ఏమి చెప్పితి"వని మహమ్మదీయులు వేపుకు తినుచున్నారు. ఇంకొకట "బహుళ సంఖ్యాకులమైన మామాట నేమి చెప్పవు"వని హిందువులు రాల్చుకు తినుచున్నారు. ప్రస్తుతము నాయవస్థ ముందునకు సాగిన నుయ్యి; వెనుకకుసాఁగిన గొయ్యి అన్నట్లున్నది. ఇట్టి కష్టము లెవ్వియు లేకుండ నెట్లో నెమ్మదిమై నీ యుద్యోగము నిర్వహించి నేఁడు విశ్రాంతి గైకొనిన ఆ మహారాజు ధన్యుఁడు.

సే:- (ప్రవేశించి; కృతాంజలియై;) దేవ! స్నానపరికరములన్నియు సిద్ధము కాఁబడినవి. తమరింక స్నానగృహమున కరుదెంచుటయే ఆలస్యము.

మహా:- మంచిది ప్రధాని! ఇఁక నీవేగి యిప్పుడు మనము ప్రసంగించుకొని నట్లు వర్తించుము. ఇదే నేనును లోని కరుగుచున్నాను. (పరస్పర గౌరవసూచనానంతర మందఱు నిష్క్రమింతురు.)

## 4-వ-రంగము.

## వి శా ల న గ ర ము

(సానుచరుఁడై సేనాపతి ప్రవేశించును.)

సేనా:- (నగరమంతను బరిశీలించుచు) ఓ సోదరీ సోదరులారా! ఇంకను దూష్ణీం భావము వహింతురేల? లెండు- లెండు;-

మ. తఱి రానే చనుదెంచె; లెండిక సమస్త ప్రాగ్జ్యోతీభారతా
వరణాత్మీయయువకుల్ స్వరాజ్య సమర వ్యాపార భూమిస్థలిన్
వరశాంత్యాయుధముల్ ధరించితమస్వత్వమ్ముల్ యథారీతి డ
గ్గర బోరాడి తుదన్ స్వతంత్రపు బతాకమ్మున్ బ్రతిష్ఠింపగన్.

(కొంచెముపక్రమించి) ఓ భారతమాత! ప్రస్తుతము నిన్నుఁజూడ నాకు విచారానుకంపలు పుట్టుచున్నవమ్మ!

మ. సకలైకావనికెల్ల మిన్నవని విశ్వాత్మీభుజుల్ నిన్ను మా
తృకగా నెంచి సపర్యజేయ; సుయశోదీవ్యన్మహాభాగ్య వీ
రకులాగ్రేసరమై చెలంగిన భవద్రాజన్మహాజాతకం
బకటా! నేటికి నిట్టులయ్యెగద; మాతా! నీచ దాస్యంబునన్.

గీ. ఏది లేకున్న నరజన్మ మెత్తినందు
కవనిజాతీయ గీతికనైన బాడు
కొనుట కావంతయును నోచుకొనగలేదు
దేననో, కడకిప్పుడు నీ కానుపకట! (నిశ్వసించి)

నరేంద్ర! ఇటురమ్ము.

న:_ (కరములు మోడ్చి) ఏమి సెలవు?

సేనా:_ నాయనా! మీరందఱింకను లోకజ్ఞాన మెఱుగని పిల్లకాయలు, కాని ప్రస్తుత వాతావరణమున నుద్భవించిన నూతనావేశమున బరవశులై 'తగుదుమమ్మా' యని యీ సత్యాగ్రహరణావనికి దుమికిరి. మఱి; ఈ యుద్యమమును తుదకెట్లు పరిణమింప జేయుదురో? ఇదుగో!

సీ. రక్షి ప్రజలువచ్చి లాఠీలతో బాదు
తఱి నెదురాడక శాంతమ్మువలయు
ఏలి కభటులు మిమ్మేమైన దుర్భాషలాడిన
సైచి సడాడవలయు
అధిపు కింకరులు తా రరుదెంచి బంధింతు
రేని తలఁకక హర్షింపవలయు
ప్రభువు మీయాస్తుల స్వాధీనముం జేసు
కొనబోయినన్ స్థైర్యమొనరవలయు

గీ. ఎన్ని యిడుమలనైన సహింపవలయు
మదకు; సత్యాగ్రహాజిని దుముకుటన్న
ఉండవలెనింత; ఇందు నే దుండి యేది
లేకపోయిన కష్టమ్మె; ఓ కుమార!

న:- ఆర్యా! అనుమానింపకుడు. ఇప్పుడు మేమందఱము తమరెట్లు చెప్పిన యట్లు నడచుటకు సంసిద్ధులమై యున్నాము. (పరివారము హర్ష సూచనలొనర్చును)
మఱియు,-

గీ. దేశమాతకు గర్భకోటీశులెల్ల
తమ సమస్తము నిడి సౌఖ్యతత్వ మెడలి;
భక్తి పరులయి; ఆపె సేవనము చేయ
నేటి సుఖమయ్యా? మాకు నింకేటిభయము?

సేనా:- సంతోషము; నరేంద్రా! సంతోషము. (దూరమున జూచి అంగుళి నిర్దేశించి;) ఆ పోయెడి వారెవరై యుందురు?
న:- (పరిశీలించి) వారు విద్యార్థులువలె నున్నారు.
సేనా:- విద్యార్థులా! వారికిటు రా బనియేమున్నది? ఈమధ్య నారండ యను జాతీయ గీతనిరోధనకై సమ్మెకట్టిరి కదా?
న:- ఐనను; కొందఱు విద్యాలయములకు బోవుచునే యున్నారు.
సేనా:- (కనుబొమలు చిట్లించి) ఆఁ! అయిన సాంతము సమ్మెగట్టలేదా? ఇంకను మనవారికి నైకమత్యదేవత పూర్తిగ సిద్ధింపలేదు కాబోలు. ఓ విద్యార్థులారా! మఱలుఁడు; మఱలుఁడు.

శా. లేదార క్తము మీాశరీరముల; గారే మీార లీ భారతో
ర్వీదాయుల్; మఱియూరకుందురె నిజోర్వీసర్వసంతానముల్
కాదంచున్ వచియింప కిందురికి శంఖధ్వానములేయు; రా
లేదా; తన్నిన దమ్ములింతకును మీా రిక్తాంతరంగాళికిన్.

న:- (అంగుళినిర్దేశించి) దేశోద్ధారక! అదిగో; అటుపోవుచున్న వారును విద్యార్థులే కాని మహమ్మదీయులు.
సేనా:- (నగి) వెఱ్ఱివాడా! మహమ్మదీయులొకటి; హిందువులొకటి యను కొనుచుంటివా? మన భారతమాత తన బిడ్డలగు సర్వభారతీయుల

యందును సమాన ప్రేమనే చూపెడిఁగాని మతకులములతో నాపెకు బనిలేదు. కాని యహింసాతత్త్వము నెవరెక్కుడుగ నుపాసింతురో; వారి నాతల్లి యెక్కువగ బ్రేమించును. మహమ్మదీయులలోగూడ నిట్టి కొందఱింకను ఈ స్వరాజ్య సంస్థ నర్థము చేసుకొనలేక దేశ మాతను సంతోషపెట్టలేకున్నారు. ఇది కాలమహిమ. ఓ మహమ్మ దీయ సోదరులారా! ఇంకను మీ రీ మతవైషమ్యములేల పెట్టు కొందురు?

చ. మతముల జోక్యమిందుననుమాత్రములేదదికాక; మాతృభూ
మితల సపర్యఁజేయుటకు మీరును మేమననేల? సర్వభా
రత ధరణీజులందరు నిరంతరమర్హులు; కాన మహమ్మదీ
యతరుణులార! పూనుకొనరయ్య! స్వరాజ్యసమార్జనాజికిన్॥

న:- దేవ! నేటిపత్రికలో కొందఱు స్థానిక మహమ్మదీయులును; ఈ యుద్ధ్యమరంగమున అకళంక హృదయులై ప్రవేశించిరని చదివితిని.

సేనా:- ఔను. ఆ విషయమెంతయు బ్రశంసనీయము.

( తెరలో )

ఓ పౌరస్వత్వవాంఛితులారా! విజృంభింపుఁడు - విజృంభింపుఁడు.

ఉ. ఏదెటులైనగాని ప్రథనేచ్ఛనువీడి చరింపబోకుఁడో
సోదర సోదరీమణులు! సొమ్ములుభూములు గేహముల్ సమ
స్తాదరణీయవస్తువులు దారిన దారగనిండు; బంధమే
సాదిన సాదనిండు; తమ స్వత్వ సమగ్రత వచ్చునంతకున్.

సేనా:- (విని) నరేంద్ర! చూచితివా? పౌరస్వత్వవాంఛితుల ప్రచారమెంత బలవత్తరముగ నున్నదో! అదుగో మీరును ఇప్పుడట్టి శ్రద్ధబుచ్చు కొనవలయును అటయినఁ జివరకు జయోదయము మనదేయగును.

న:- చిత్తము. ముమ్మాటికిని విజయము మన యదియే.
(అంతలో ప్రచ్ఛన్న వేషధారియగు కింకరుఁడు వచ్చును)
కిం:- (ఇటునటుచూచి) అయ్యా! తమ పేరు?
సేనా:- ఇతఁడు మారువేషముననున్న రాజకింకరుఁడు కానిమఱొకఁడుకాఁడు-
(ప్రకాశముగ) సేనాపతి.
కిం:- నాయన పేరు?
సేనా:- ఇప్పుడెక్కడోయున్న నాయన పేరెందుకు?
కిం:- కావలయును.
సేనా:- అయిన వ్రాసుకో. రామచంద్రుఁడు.
కిం:- తమ నివాసమెక్కడ?
సేనా:- పశ్చిమ నగరము.
కిం:- ఉద్యోగము.
సేనా:- దేశసేవ.
కిం:- అనగా?
సేనా:- ఔనులే-అదియొక ఉద్యోగము వ్రాసుకో.
కిం:- ఇచ్చటికి వచ్చినపని?
సేనా:- ఇచ్చటి పరిస్థితుల నరయుటకు.
కిం:- ఇచ్చటి పరిస్థితులతో దమకేమిపని?
సేనా:- తెల్లవారి లేచినది లగాయతు తిరిగి పరుండువరకు నాయుద్యోగము
నకు వాటితోనే పనియుండును.
కిం:- ప్రస్తుతము తమ బస యెక్కడ?
సేనా:- ఈ నగరవీధులే నా నివాస స్థలములు.
కిం:- అయ్యా! నేను రాజకింకరుఁడను మా యధికారియుత్తరువు ననుసరించి
తమ్ము బంధించితిని. (బేడీలు వేయును.)
సేనా:- సంతోషము కాని దీనికి కారణమున్నదా?
కిం:- తమరొనర్చిన శాసనోల్లంఘనమే దీనికి కారణము.
న:- అరే! రాజకీయ బంధితులకుగూడ నరదండములు వేయుదురా?
కిం:- ఆఁ! ఎవరికైనను తప్పదు. (తీసుకొని వెళ్ళుచుండును)
న: సేనాపతి బంధితుడైనాఁడు. ఇకమాకు నాయకుఁడెవరు?
సోదరులారా! రండు; మనమును నాయకుని వెంబడింతము.(వెళ్లుదురు)

## 5-వ-రంగము.

# అహింసాశ్రమము.

(జాతీయవస్త్రధారులై పండిత భోగరాజులు ప్రవేశింతురు)

పం:- నేను ఖండాంతరములలో నున్నప్పుడు కంటె నిప్పుడు భరతమాతకు రాను రాను రోగము హెచ్చుచున్నది. మఱి ఇది ఎట్టి యౌషధమున గుదిరెడినో తెలియకున్నది. (ప్రకాశముగ) భోగరాజు! ప్రస్తుతము స్వదేశ సంస్థానములలోని వాతావరణము చాలపరకు క్రమింతి మించి రోగమున బడుచున్నది.

భో:- ఆర్యా! కాలపరిణామము డగ్గరిల్లినప్పుడు దైవమే యట్లొనర్చును. కాని-చో, పాపమా యమాయిక జనులెంతకాలమా నిరంకుశ ప్రభుత్వములకు నోర్చుకొని తిరుగగలరు?

పం:- చిన్న సంస్థానాధీశ్వరుడైనను దన ప్రజకు హృదయపూర్వకముగ; సంపూర్ణ బాధ్యతాయుత పరిపాలననొసగి యావద్భారతీయ సంస్థానాధిపతులకును అదర్శప్రాయుడైనాడు ఔంధుమహారాజు.

భో:- అతడు కేవలము ప్రజాక్షేమము గోరు మహారాజగుటంజేసి యట్లొనర్చినాడు. ముందతని నామాక్షరములు స్వరాజ్య చరిత్రలో సువర్ణమయములై లిఖింపబడును.

పం:- అట్లే యగుగాక! భోగరాజు! ప్రకృతము సౌభాగ్య సంస్థాన పరిస్థితులెట్లు పరిణమించుచున్నవి?

భో:- ఆ ప్రభుత్వ పరిస్థితులు గడుంగడు వికృతముగ పరిణమించుచున్నవి.

పం:- ఏమి?

భో:- ఏమన నొకటేయా? ప్రస్తుతము వ్యవధి చాలదేమోకాని; చెప్పవలసినది బోలెడంత ఉన్నది.

పం:- వ్యవధి యున్నంతవఱకు జెప్పు.

భో:- ప్రభుత్వ విధానము చాల నిరంకుశముగానున్నది. చూచితిరా! మొన్న వారు నన్నును బంధింప బ్రయత్నించిరి. కాని అక్కడ వారి యాటలేమియు సాగలేదు.

పం:_ భోగరాజు! నువ్వు నూరు చెప్పు కాని; చివరకీ స్వదేశ సంస్థానములు మాసినగాని భరతఖండమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము రానేరదు.

భో:_ ప్రస్తుత పరిస్థితులబట్టి యట్లే యనిపించుచుగాని, ఇంతటనైనను, వారు ధర్మజ్ఞులై ప్రజలకు ధర్మకర్తలుగనుండి పాలించిన; భారత సంపూర్ణ స్వాతంత్ర్య సమార్జనమునకు వారు మాయ నక్కఅయుండదు. కాని మత కుల వైషమ్యములు మాత్రముండరాదు.

పం:_ భోగరాజు! సౌభాగ్యరాష్ట్రమున స్థానిక విద్యార్థులు పెక్కుమంది ప్రస్తుతమక్కడి వాతావరణమున కనుకూలముగ వర్తించుచున్నారని వినుచున్నాను నిజమేనా?

భో:_ అఁ_నిజమే.

పం:_ సంతోషము. ఎందుకనిన, వారు మొత్తముమీద పూనుకొనవలయునే కాని పూనుకొనిన నెట్టి ప్రయత్నమునైనను సఫలీకృతమొనర్చినగాని విడువరు భోగరాజు!

శా॥ విద్యార్థుల్ కద, వంగ శాంతి సమరోర్వీ కేంద్ర దేశమ్ములన్
సద్యోఽఽఽవేశ మలర్పగాలిడి; యహింసా వీర నాట్యంబులం
దుద్యోగించి; స్వరాజ్యసంస్థ కిల నభ్యుత్థానమీ యింత సం
పాద్యంబుం బొనరించి పెట్టినది; అప్పా! వారి కష్టున్నదే?

భో:_ ఆమాట నిజమే. కాని ఇప్పటి విద్యార్థులంతటి స్వార్థత్యాగమునకు నొడంబడవలయునుగదా?

పం:_ ఒడంబడినప్పటి మాటనే చెప్పుచున్నాను. ఆర్య! ప్రస్తుత దారుణ పరిస్థితులనుబట్టి స్త్రీంకనలు శాంతిసమరమునకు నేనొకవేళ నాయకత్వము వహించిన బాగుండునేమో యని తోచుచున్నది.

భో:_ దాని కింకను సందేహమా?

పం:_ అయినను తొందర పనికిరాదు.

( తెరలో )

ఓ శాంతి సైనికులారా !

ఉ॥ వచ్చెడివాడు పండితుఁడవశ్యము గెల్వనరాదు; హెచ్చినన్
హెచ్చగవచ్చు దీన భరియింపగరాని యశాంతి; కీర్తియో
మచ్చలపాలుచెందు; ననుమానము లేదిక ఉన్నదానికే
వచ్చెడిమోస; మంచు బెఱవారు భయంపడ బోరుసల్పుడీ.

పం:- (దృష్టినిల్పి) ఆ స్వేచ్ఛాలాపము లెవరివై యుండును?

భో:- (ఆలోచించి; యిటునటుచూచి; యంగుళి నిర్దేశించి?) అడుగో! ఎవరో ఆ మూలనుండి ఒక యువకుడిటు వచ్చుచున్నాడు. ఈ యాలాపము లతనివియై యుండనోపు.

పం:- (పరిశీలించి) ఔను. అతడెవరో! (అంతలో నాయువకుడు ప్రవేశించి, నమస్కరించి నిలుచుండును.)

భో:- అబ్బాయి! నీ పేరెవరు ?

యువ:- వెంకోజీ.

పం:- నివాసమెక్కడ ?

వెం:- సౌభాగ్యనగరము.

భో:- నీవు ప్రస్తుత మేమి చేయుచున్నావు ?

వెం:- బి. ఏ. చదువుచున్నాను.

పం:- అయిన ఇక్కడకు వచ్చినపని?

వెం:- ప్రస్తుతము మా రాష్ట్రమున జరుగుచున్న శాంతి సమర పరిస్థితులను గురించి మహాత్మునితో మాటాడవచ్చితిని.

పం:- (వీపుజఱచి) భేష్! విద్యార్థి అనిన ఇట్లుండవలయును. మీ సమ్మె నిర్విఘ్నముగ గొనసాగుచున్నదా?

వెం:- బాగుగనే జరుగుచున్నది. కాని కొందఱింకను సాహసింపలేకున్నారు.

పం:- నేనును ఇట్లేవింటిని (విద్యార్థుల నుద్దేశించి) ఓ సౌభాగ్యరాష్ట్ర విద్యార్థులారా! ఇంకను అనుమానించెదరేల?

శా॥ జాతీయంబగు రక్త మింతకును మీ శారీరనాళమ్ములన్
జేతఃప్రక్రియ బారుచుండు నెడ; వాసిన్ గొన్న మీ ప్రాన్కపై
నేతృత్వంబిడినట్టి యుద్ధముల దా నిర్మూలముం జేయు వే
ళాతత్త్వం బరుదెంచుదాఁక, కడు స్థైర్యంబూని జృంభింపరే?

వెంకోజీ! నిన్నుజూచిన నాకు కడుంగడు సంతసమునిపించుచున్నది.
రా_ మహాత్ముని దరియం జేరుదము. భోగరాజు! రా_ (జేరి, నమస్కరించి) మహాత్మా! ఈ విద్యార్థి సౌభాగ్య రాష్ట్రీయుడు. ప్రస్తుతము తమతో గొన్ని యంశముల గుఱించి సంప్రదింప నరుదెంచినాడు. (విద్యార్థి దిక్కై కనుసంజ్ఞ సేసెను.)
వెం:_ మహాత్మా! నమస్కారము. (పాదముల కెఱఁగును.)
మ:_ (దీవించి; దగ్గరదీసి) నాయనా! నీ పేరేమి? నీవువచ్చిన పనియేమి?
వెం:_ నా పేరు వెంకోజీ. ప్రస్తుతము తమకు మా సౌభాగ్యరాష్ట్రీయ శాంతి సమరాంశముల నెఱింగింప వచ్చితిని. (చేతి సంచినుండి పత్రముదీసి) ఇదిగో_ఈపత్రమును దిలకించిన దమకంతయు దెలియును.
మ:_ (చదివి) బాగున్నది. మీ రాష్ట్రీయుల స్థైర్యమునకు నేనెంతయు సంతసించుచున్నాను. కాని ఈ పట్టుదల ఇట్లే తుదవంట నుండవలయును. అబ్బాయీ!

చ॥ అయినను ఆ రణవ్రతమయాచిత శాంతిగుణ ప్రధానమై
సయుత మొనర్పగావలయు; భావములందునఁగూడ దుర్జన
త్వయుతము లుంచరాదు; నిరతమ్ము నిదేవిధికాగ మీకు మీ
రయి పచరించినన్; మహస్వరాజ్యజయంబునకెంత శంకయే ?

అంతటి యవసరము వచ్చునేని మీకు సహాయమొనర్చుటకు అఖిల భారత స్వరాజ్య సంస్థ సంసిద్ధముగనున్నదని నావచనములుగ మీవారికెరుక జేయుము.

వెం:_ చిత్తము. (లేచి, అంజలిబద్ధుడై) మహాత్మా! నాకు సెలవొసఁగుడు.
(అందఱకు నమస్కరించి వెడలును)

భో:- (కృతాంజలియై) మహాత్మా! తమకు తెలియని దేదియు నుండదు; కాని, అఖిలభారత స్వరాజ్యసంస్థ సంస్థానములలో జోక్యము కలిగించు కొనిన బాగుండు నేమోయని తలంచు చున్నాను.

పం:- ఔను. మహాత్మాజీ!

చ॥ సకలవిధంబు లచ్చటి ప్రజల్ కడు కష్టము లొందుచుండి రే
యొకఘడియైన వారలు సుఖోదయమన్ బలుకే ఎఱుంగ రిం
కొక పది రోజులిట్లు మనమూరకజూచుచు నుందుమేని; లే
దిఁక ననుమాన మింతయు గృశించి నశింతురు వారు;శ్రీవరా!

మ:- మీ యిరువురి యుద్దేశములును అంగీకరణీయములే. కాని అఖిలభారత స్వరాజ్య సంస్థ తానట్టి జోక్యమును గలిగించుకొనుటకు; కొంత కాలాతీతము కావలయును.

పం:- తమరన్నది వాస్తవమే.

భో:- నిన్న మొన్నటివఱకును రామరాజ్య మనబడిన తిరువాన్కూరు ప్రభుత్వమును తుడకు రాక్షసత్వ మవలంబించినది.

మ:- ఔను. అది కాలమహిమ.

(అంత నొక స్వైరి పటాక్షేపముగ బ్రవేశించును)

స్వైరి:- (బద్ధాంజలియై) మహాత్మా! తమ దర్శన నిమిత్త మాంధ్ర ధరాధీశ్వరులు వచ్చి యావల నిరీక్షించుచున్నారు. సెలవైన ప్రవేశపెట్టెద.

మ:- మంచిది. ఆ మహాశయుల నెంతయు గౌరవముగ నభ్యంతర కుటీరమున ప్రవేశ పెట్టుము. మేమును ఇదే వచ్చుచున్నాము.

స్వైరి:- చిత్తము. (వెడలును.)

మ:- (ఇరువురి దెసఁజూచి) బాధ్యతాయుత పరిపాలన ప్రణాళికను గుఱించి నాతో నాలోచింప నామహారాజియ్యెడకు వచ్చియుండనోపు. ఇక వెళ్ళుదము లెండు.

ఉభయులు:- మంచిది (నిష్క్రమింతురు.)

# 6 వ రంగము.

## కాళీఘట్టము.

(వార్తాపత్రికతో సుజన్మఁడు ప్రవేశించును)

సు:- (గదిలో నొక చాపమీద గూర్చొని) ఆహా! దైవమాయ!! ప్రాపంచిక వాతావరణము నానాటికి నేదో విపరీతముగనే పరిణమించు చున్నది. సర్వమత సహిష్ణుత్వము వహించి నేటికి నేబది వర్షములనుండి పరార్థముగ కృషిసలుపుచున్న ఈ స్వరాజ్య సంస్థయెడ నేడు జిన్నా ప్రతికూలించుచున్నాడు. అంతియకాక, ఈ పవిత్ర సంస్థను కేవల పరమత వైషమ్యముకలదానిగ నిర్వచించుచున్నాడు. కట్టా! ఎంత యన్యాయము!

చ॥ మునుపటినుండియున్ భరతభూమి మతావృతభాగ్యనాశ భం
డనములతోడనే నలిగి నల్గి సమస్తము గోలుపోయి యం
డిన యల్పమానుపోల్కి సుగతింజెడియున్నది; ఉండినన్ వృధా
జననములైన ఈమత విశాల విరోధము లీఁగ వింతకున్.

జం:- (మోటారున గూర్చొని) ఇదియే సుజన్మని మందిరము. (సేవకుని బిలచి) ఓయీ! ఈ దర్శన పత్రికను మీయయ్య కిచ్చిరమ్ము.

సే:- (పుచ్చుకొని వెళ్ళి తిరిగివచ్చి) బాబూ! సెలవైనది. దయచేయుడు.

జం:- మంచిది. నీవు ముందు నడువుము. (మోటారు దిగును.)

సే:- చిత్తము. దయచేయుడు.

సు:- (కిటికీనుండి చూచి) అదుగో జంగుగారు వచ్చుచున్నారు. ఈయన ఏదో యొక పని తొందరమై వచ్చినట్లుగపడుచున్నాడు. కానిమ్ము.

క॥ తినబోవుచు రుచి నడుగన్
బనియేటికి నిల్లు కొంతవఱ కెదలో దా
ళిన సర్వము తెల్లంబగు
ననువుగదా నేగుదెంచినట్టి ప్రవృత్తుల్.

(అంత జంగు ప్రవేశించును. ఇరువురు పరస్పర గౌరవ సంజ్ఞలొనర్చు కొని కూర్చొందురు.)

సు:- జంగుగారూ! తమరిపుడు స్వస్థానమునుండియే వచ్చితిరా?

జం:- లేదండి; స్వస్థానమునుండి పాటలీపుత్రమునకేగి, యటనుండి గృహ మును జేరబోవుచు మధ్యస్థులైన మిమ్ము దర్శింపగోరిక జనించు టంజేసి యిక్కడ దిగితిని.

సు:- (బొమలు చిట్లించి) ఓ! సంతోషము. అట్లయిన మాయందు దమకున్న ప్రేమ యతీతమైనదియే. అయిన దమరు జిన్నాగారి సభాసమావేశ మునుజూచి వెళ్ళుచున్నారు కాబోలు.

జం:- అవునండి.

సు:- జంగుగారూ! ప్రస్తుతము తమ దేశమున జరుగుచున్న శాంతి సమాచా రము మీ నోట వినవలయునని కుతూహలపడుచున్నాను.

జం:- అయ్యో! చెప్పుటకేమున్నది? అది యీమధ్య మా ప్రభుత్వమునకు భారతీయ స్వరాజ్య సంస్థకును జరిగిన యొడంబడికల ననుసరించి ప్రస్తుత మాగినట్లున్నది. (తనలో) నేనెత్తకుండగనే యితడే యీ ప్రసంగము నెత్తినాడు. ఇక నావచ్చిన కార్యక్రమణిక నెఱింగించుట కిదియే తరుణము. (ప్రకాశముగ) సుజన్మ! ఇప్పుడు తమతో నొక విషయము మాటాడవలసి వచ్చితిని; సెలవైన నుపక్రమింతును.

సు.- అవశ్యముగ జెప్పుడు.

జం:- మంచిది. ఆలకింపుడు. మాదేశీయ శాంతి సమరమంతయు దమకు వ్యక్తమేకదా కనుక;

శా॥ మారాష్ట్రమ్మున మేముమేమెటులో నంభావించుకోవచ్చుగా
నీ; రాకూడదు మిమ్ముబోటి పరదేశీయుల్ తదీయాజిలో
జేరన్; వచ్చిన నాయకత్వమునసలే వాంఛింపగాకూడదా
భూరాష్ట్రమ్ముస్వరాష్ట్రమాట;యవనాంభోధిక్షపానాయకా!

సు:- మీరు సెలవిచ్చినది చాల బాగున్నది. కాని తమరెట్టి యభిప్రాయ ము లో నిడుకొని యిట్లుప్రసంగించుచున్నారో; నాకవగతమగుటలేదు.

జం:- ఏమున్నది? ప్రస్తుతము మా సౌభాగ్యరాష్ట్రమున జరుగుచున్న శాంతి సమరమునకు విదేశీయులగు తమబోంట్లెవ్వరును జేయూత యొసగవలదని మనవి చేయుచున్నాను.

సు:- (బొమలు చిట్లించి) ఓహో! అదియా మీ యభిప్రాయము! అయిన దత్సమరమున జోక్యము కలిగించుకొనుటకు స్వదేశీయులకు హక్కు కలదనుకొందును. ఉన్నదా?

జం:- ఆఁ-ఉన్నది.

సు:- అయిన మాకును ఉన్నట్లే.

జం:- అదెట్లు?

సు:- మేమును స్వదేశీయులమే.

జం:- తమ యభిప్రాయము నాకర్థమగుటలేదు.

సు:- ఇదుగో వినుడు;

శా॥ ఆ రాష్ట్రమ్మఖిలైక భారత ధరాంబాంతర్గతం బౌట; ను
ర్వీరాజ్యంబున నెంతదాఁక భరతోర్వీజుల్ ప్రవర్తింత్రొ; అ
న్నారల్ సర్వులు హక్కుదారు లెటయే నవ్వర్తింప నీభారతో
ర్వీరాజ్యాంతరిత ప్రదేశముల; నిర్భీతి ప్రహర్షింబుగన్.

మఱియు భారతఖండమునకు భారతీయ సంస్థానములకును గడుంగడు దగ్గర పట్టరిక ముండుటంజేసి యాయా ప్రజలకు సంబంధబాంధవ్యము లుండకపోవు. కనుక మే మయ్యెడకు రావచ్చును; మీ రియ్యెడకు రావచ్చును. అక్కడ నిషేధింపదగిన దేదియునుండదు.

జం:- (తనలో) ఇతడు పెడదారి బట్టుచున్నాడు. (పెలుపలకు) స్వకులీనులగు మీరును నిట్లు పెలకిత్తురేల?

సు:- నేనే కాదు. నిష్పాక్షికబుద్ధిగల విజ్ఞానులెవరైనను నిట్లే పలుకుదురు. ఇదియ న్యాయము. తదుపరి నాకు సర్వము నొక్కటియే యని భావింపుడు.

జం:- (తనలో) ఇతడు పూర్వము నేననుకొన్నట్లు నా యభిప్రాయమున గలియునట్లగ పడడు.

(అంత పండితుడు ప్రవేశించును. పరస్పర గౌరవసూచనలు జరుగును)

సు:- పండిత! తమకు నూరేండ్లాయు వున్నది.

పం:– ఏమి?

సు:– తమ్ము నెదలో ననుకొనుచుండగనే విచ్చేసిరి కనుక.

పం:– నూరేండ్లేకాదు. భరతఖండము తా సంపూర్ణ స్వారాజ్యము సంపాదించి మరల నీ ప్రపంచమునందంతట నఖండ వైభవోపేతయై వెలుగు దనుక జీవింపవలయుననియే భావించుచున్నాను.

సు:– అవశ్యమట్లే ఈశ్వరుడును దమకుదోడై నిలుచుగాత.

జం:– (తనలో) ఈ యాజానుబాహుని జీవితప్రపంచము నాకాశ్చర్య సంతోషముల గల్గించుచున్నది.

పం:– (వ్రేలుజూపి) వీ రెవరు?

సు:– వీరు జంగుగారు, సౌభాగ్యరాష్ట్రమునందలి యస్మదాదులకు ముఖ్య నాయకులు. పాటలీపుత్రమునుండి యింటికిబోవుచు నన్నుగలసి యేగుదమని యింతకు మునుపే యిటకు విచ్చేసిరి. మఱియు తత్ప్రతి నిధులుగగూడ చనుదెంచిరని చెప్పవచ్చును.

పం:– ఓ! తెలిసినది. (తనలో) ఈయన జిన్నాసహావేశమునుండి వచ్చుచుండనోపు (ప్రకాశముగ) అయిన వీరు వచ్చిన పనియేమి?

సు:– వీరి రాష్ట్రమున ప్రస్తుతము విజృంభించుచున్న శాంతి సమరమునందు దేశద్రోహులైన అస్మదాదు లెవ్వరును జోక్యము కలిగించుకొన వద్దని చెప్పవచ్చిరట.

పం:– అది సమంజసముగ లేదు సుజన్మ! నీకు మాత్రము తెలియదా?

గీ॥ "నే భరతవాసి" ననుచు గుండెసయి గరము
నేసివచియించు ప్రతి భారతీయునకును
సేతుహిమనగమధ్యస్థభూతలంబు
నందునంతట నడయాడ హక్కుకలదు॥

సు:– ఔను. ఇంతకుముందు నేనును ఇట్లే నుడివితిని.

జం:– (తనలో) వీరికి కులమతములే భిన్నములుకాని హృదయము లొకటియే. అట్లుకాదేని, ఇంతకు ముందు సుజన్ముడు నుడివిన నుడికారమును ఇతడు వినకుండగనే 'తు॥ చ॥' తప్పకుండ నిట్లేటు యొప్పగింప గలిగియుండును? మఱచితి, కాంగ్రెసు పక్షమునకు సార్థత్యాగము

నహింసాతత్వములే కులమతములు కానిమరేకులమతములును లేవు. నిజము నకీ సంస్థను శత్రువులైనను, హృదయముల బవిత్ర సంసర్గ భావింపక పోరు. (ప్రకాశముగ) సుజన్మ! ఇఁక నాకేమి సెలవు?

సు:- ఏమున్నదిక నా చెప్పవలసిన దంతయు నిదివఱకే చెప్పితిని.

జం:- (తనలో) నేనొకటితలచిన దైవ మొకటితలచినాడు. ఇఁక మా ప్రయత్నము ఫలవంతమగు నట్లగుపింపదు. ఇఁక నిటనుండి మెల్లగ జాఱుటయే మంచిది. (ప్రకాశముగ) సరే. నా చెప్పవలసినదంతయు జెప్పితిని. ఆపైన తమ యిష్టము. మఱినాకు సెలవొసగుడు. (గౌరవక్రియానంతరము జంగు మోటారుకడకు వచ్చును.)

సు:- పండిత! వింటిరికదా జంగుగారి ప్రసంగము.

పం:- ఆఁ-అంతయు వింటిని.

జం:- (మోటారున గూర్చొని) సుజన్ముడు స్వకులస్థుడయ్యు నా మాటలు పెడచెవినిబెట్టినాడు. రాబోయెడి యెన్నికలలో స్వరాజ్య అభ్యర్థితవహించు నాశ యితనిని పీల్చి పిప్పి చేయుచున్నది కాబోలు. కాదేని నాకిట్లు ప్రతికూలించడు. పండితుడును నాకు వినునట్లగ పడలేదు, కానిమ్ము. నా శక్తివంచన లేకుండ నా ప్రయత్నము నే జేసితిని. తదుపరి దైవమే కలడు. (అంత మోటారు కదలును.)

పం:- సుజన్మ! ప్రస్తుతము మీ భారతీయ సంస్థానాధీశుల పరిపాలన యెంత కఠోర స్వభావము వహించుచున్నదో చూచితిరా? పై పెద్ద సంస్థానాధిపతులు మనకడకు నిట్లు రాయబారుల నంపుదురు. ఎందుకు? ఏమిలాభము? ఇంతకంటె మొదటనే మేలుకొనిన ఎంత బాగుండి యుండును. చివరకేది యెటులైనను ఆ అమాయిక ప్రజలను ఆ యమ బాధల నుండి తప్పించి శరణునొసగు భారము మనపై నున్నది. సుజన్మ!

చ॥ "వెనుక నిశాచరేశ్వరులు పృథ్వినినేలిరి; దారుణంబులౌ
పనుల బొనర్చి లోకులను బాధలకుం గురిచేసిర"ంచు బల్
ఘనులు వచింపగా వినుటెకాని; స్వయమ్ముగ జూడలేదు; నే
టి నరవరాళిగాంచిన గడింది విచారము పుట్టె పొంగెడిన్॥

సు:- ఔను విజయ కాలచక్రము కాంగ్రెసుపతాకమును జుట్టివచ్చుచున్నప్పు డిట్టి సూచనలే పొడగట్టును.

జం:- సుజన్మ! గౌరవనీయులగు రాజకీయ బంధితుల యవస్థలెట్లు పరిణమించుచున్నవో చూచితిరా?

గీ॥ దాహ మడిగిన ఆ పాచితనపు నోట
నుండి కాండ్రించి యుమిసిన యుదకమిచ్చి
త్రాగకుండగ రోసిన, "త్రాగు త్రాగు
మ"ంచు బాదుట యెక్కడి న్యాయమయ్య!

సు:- పండిత! ఇంతమాత్రముననే యాశ్చర్యమందెదరేల? ఎన్ని కల్పాంతములకైనను మరపురాని ఆ పాంచాల ఘోర చిత్రవధను మీరు కని విని యుండలేదా? వానిలో నిది యెన్నవవంతు? పిల్లలు తల్లిదండ్రులనే అనుకరింతురు. ఎన్ని కష్టములకైనను ఓర్చి వంగి తలొగ్గినప్పుడే ఆ వ్యక్తి చివరకు నానందసుఖసాగరతరంగబిందుభిన్నశకలసమ్మిళితమందు మారుతలోకమున విహరింపగలుగును.

పం:- తమరన్నది నిజమే. కాని ప్రస్తుత ఢెంకనల్పరిస్థితులు గాంచిన వెనుకటి రక్షఃప్రభుత్వ కథాంశములు జ్ఞప్తికి వచ్చుచున్నవి. ఎందుచేతనో మఱచిపోవుదమన్నను మరపురాకున్నవి. ఏమిచేయుదును?

సు:- ఔను. అసలైన భారతీయ హృదయముల ప్రకృతి యిట్లే నవనీతప్రాయమై యుండును.

పం:- నిష్పాక్షిక బుద్ధీ! తమకా దారుణ వార్తలు చెవి సోకినవో లేదో కాని; నా హృదయ మా వార్తలు విన్నప్పటినుండియు గలగిపోవుచున్నది. అబ్బా ఎంతదారుణము! ఆర్యమిత్ర!

మ॥ అవమానించిరి స్త్రీజనంబులను గ్రౌర్యంబూని, యాక్రందనా
రవముల్ మింట బచారుచేయ; బురుషవ్రాతమ్ములన్ నిర్దయా
భవులై వాతలుబెట్టి రా; పయిన దద్భాగ్యంబు లన్నింటిని జే
రువకుం గైకొని పాఱద్రోలిరి; ప్రజన్ రోషప్రధానాత్ములై॥

శా॥ ఉన్నాడో మఱి లేడో దేవుడు; తదీయార్యజనంబెల్లనె
న్నెన్నో చిక్కులకగ్గమై తినుట నాకొక్కింతేనియున్ లేక స
ర్వోన్నత్యంబులు గోలుపోయె; దుదకున్ బంచైననున్ లేమినే
డన్నా! ద్రిమ్మరుచుండె నెల్లెడలగట్టా యంచుశోకించుచున్॥

సు:- భారతీయ శేఖర! నిన్ను జూడ నాకొకవంక పట్టరాని సంతసము మఱొకవంక విచారమును గలుగుచున్నవి.

గీ॥ అన్నివిధములనీకు ద్రోహైచరించి।
నట్టి నీదగు ముద్దుటిల్లాలి మరణ।
మునకు నైనను గలగి వాపోయి యెఱుగ।
విప్పుడక్లార! నీ స్వదేశీయ భక్తి!

పండిత!

గీ॥ ఇంత మాత్రనెకుంది దుఃఖించునీవు।
గర్భిణీ స్త్రీలనందఱగలిపి జాలి।
నెడలి గుట్టలనేల బొర్లించు నప్పు।
డెంతగా గుందితో! దయాహృదయకమల!

పం:- దానికేమికాని; ఈ స్వదేశ సంస్థానాధీశులు తమ ప్రజలపై నింతటి క్రూర స్వభావము వహించుటకు గతమేమై యుండును?

సు:- అసలు వారెప్పుడును సహృదయులే, వారొకవేళ ప్రజలపై గఠినత్వా కఠినత్వములు వహింతురనిన అది తత్సన్నిహితపర్తుల లోపాలోపములేకాని మఱొండుకాదు. ఇంతకును కాలానుగతి కన్నియు మార్పు జెందవలయుగదా!

పం:- ఔను తమరన్నది వాస్తవమే.

జం:- (ఘూమశకటము దిగి) మొత్తముమీద నేటికి నా సౌభాగ్య నగరమును జేరగలిగితిని. తుదకు నా ప్రయత్నమంతయు నిష్ఫలమైనది

ఆరుమూడు, మూడారైనను జయోదయమనునది స్వరాజ్యలక్ష్మి దే యగును కాని మఱొకతీరున బొసగజాలదు. ఇక జరిగిన వృత్తాంత మంతయు రాజగృహమునకరిగి మహారాజున కెఱింగించెద. (మోటారు నెక్కి నిష్క్రమించును.)

సు:- ఇంతకును చివరకు వచ్చుసరికి సంపూర్ణ స్వరాజ్యముమాట యేమగునో?

పం:- తమకీ సందేహ మనవసరము. మన భరతమాత ఇప్పుడు కాకపోయిన మఱొకప్పుడైనను తిరిగి వెనుకటివలె లోకైక మాతయయి ప్రకాశింపకపోదు. ఇది నిక్కువము.

సు:- ఔను. ఆ మాట నిజమే "ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" అన్నట్లిక్కడ యంతరాత్మయే సాక్షి.

(దివ్యవాణి)

ఉ॥ మీరనుకొన్న యూహ నిజ; మెన్నటికైన స్వరాజ్యలక్ష్మి తా
పూర్ణరీతిగా లభించు; మునుముం దిక వెండియు భారతాంబ ఈ
ధారుణికెల్ల మిన్నయయి తాల్చెడి సర్వమహోన్నతుల్ తదీ
యోరమునందు; జూపఱు 'లహో' యనివహాళులనూచి మెచ్చగన్॥

పం:- సుజన్మ! వింటిరికదా ఆ దివ్యవాక్యము. ఇక మనకు భారత సంపూర్ణ స్వరాజ్యమునట్లు సంశయమక్కఱలేదు. ఇక నే బోయివత్తును.

సు:- మంచిది. నేనును లోనికిబోయి కొంతవడి విశ్రమింతును. (ఇరువురు పరస్పర గౌరవ క్రియానంతరము నిష్క్రమింతురు.)

## ♦ భ ర త వా క్య ము ♦

భారతీయులకు దుస్సహ భయానకబంధ
నాగారభీతి బోనార్చునెవడు
అన్నింట లోకాన కాదర్శమై తొల్లి
పృథుల సత్కీర్తి నార్జించెనెవతె

తనవారలకు ధరాధామంబునం దున్న
తిం డెచ్చిపెట్టి వర్ధిల్లునెవడు
యుగ మహాత్ములకెల్ల నుర్వీతలంబునన్
పుట్టినిల్లై పెట్టి పుట్టై నెవతె

అట్టి మాతాత గాంధి పరార్థపరుడు
మనుత బదికాలములపాటు, మనుత భరత
మాత; వెండియు లోకైక మాతయగుచు
వెనుకటి మహోన్నతులు విడంబించి చెలగ.

“ స మా పి ”

# సవరణలు.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 31 | 10 | మహామ్మదీయ | మహ్మదీయ |
| 34 | 16 | సద్యోఽఽఽవేళ | సద్యోఽఽవేళ |
| 44 | 2 | నాకొక్కింతేనియున్ | కొక్కింతేనియున్ |

# సత్యదుర్గేశ్వరీయము.

## ప్రపంచయుద్ధము.

(చక్కని రాజకీయ నాటకము).

చ॥ భరతధరిత్రికిన్ స్వపరిపాలన మిప్పుడు కాకపోయినన్।
మఱియొక కాలమందయిన త్ర్యోమ్మవర! వచ్చియెతీరు; కాని ఆ।
పరమ మహోదయంబిపుడె పట్టిన దద్ఘనకీర్తి జార్జిభూ।
వరునకె దక్కగాదె? అదివాడునె? ఎన్నియుగాలకేనియున్॥

ఈ దృశ్యకావ్యములో ఈ పద్యంకంటెను చక్కని పద్యములు విన్నంతలో శరీరాన్ని పులకరింప జేసే పాటలు ఇంకా ఎన్నో అలరారుచున్నవి. ఇందలి కథ ప్రస్తుత మహాసంగ్రామమే.

త్వరలో వస్తోంది.

